





# ధర్మము

విచారణ

## బడిలో చెప్పని పాఠాలు





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120028972

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బడిలో చెప్పని పాఠాలు



ఈ కథలు -

బడిలో పాఠ్యప్రణాళిక అంశాలు మాత్రమే చెపుతారు చాల విషయాలను బయటి ప్రపంచంలో విని, చూసి, చదివి నేర్చుకోవాల్సివుంది జీవితంలో ఎదురైయ్యే ఆటుపోట్లను ఎదుర్కొనే మానసిక శక్తి, మేధాయుక్తి చిన్న వయస్సు నుండి పెంచుకుంటూ రావలసిన అవసరం వుంది అందుకని స్కూల్ పుస్తకాలే కాకుండా విద్యార్థులు బాలల సాహిత్య పుస్తకాలను చదవాల్సిన అవసరమూ వుంది మన దేశంలో చాల సాధారణ విషయాలను శాస్త్రీయంగ మన వాళ్ళు పరిచయం చేయకుండా, దానికి దైవత్వాన్ని జోడించి భక్తి భావంతో గుడ్డిగ నమ్మిస్తు వస్తూ వున్నారు గతకాలం వేరు, ఈ కంప్యూటర్ కాలం వేరు ఇప్పటి జీవితవేగమే వేరు, రీజనింగ్ లేకుండ ఏ విషయాన్ని ఆమోదించ లేని రోజులు చంద్రుని మీద కాలుమోపి రావడం జరిగింది అందుకని రోజు వారి జీవితంలో ఎదురైయ్యే సమస్యలను ఏమిటి? ఎందుకు? అని ఆలోచించేవే ఈ పుస్తకంలోని చిన్న కథలు కథ మనిషిని ఆలోచింప చేస్తుందని నా నమ్మకం, ఒక వ్యాన్ లో విజ్ఞాన యాత్రకు బయలు దేరిన స్కూల్ పిల్లలకు ఎదురైన అనుభవాలే పుస్తకంలోని కథా వస్తువులు వాళ్ళ వెంట వున్న టీచర్ వాళ్ళ అనుమానాలను నివృత్తి చేస్తూ కొత్త కొత్త ఆలోచనలను కలిగిస్తూ వుంటాడు యాత్ర చివరన వాళ్ళకు తోడైన కవిగారు వాళ్ళలో కొత్త ఆలోచనలను నాటుతాడు ఈ పుస్తకం ద్వారా బాల బాలికల్లో కొత్త ఆలోచనలను కలిగించాలన్న నాపుద్దేశం నెరవేరుతుందని నమ్ముతు -

మీ

బోయ జంగయ్య

మాన్యంచెలుక
నల్లగొండ - 508001
ఫోన్ నెం 08682 - 32515

తన గురించి తక్కువ ఆలోచించి
పరుల మేలునే ఎక్కువ కోరిన వ్యక్తి
నవ్వుతూ పలుకరించే నిర్మల మనస్సు ,
ఎవ్వరిని నొప్పించని సాధుమూర్తి
ఎందుకో అకాలమృత్యువు ఆవరించింది
మరణించినా మంచి వాళ్ళను
మరిచిపోలేము అని గుర్తు చేస్తూ
పెద్దన్న పెరికె మల్లేశం గారికి
జ్ఞాపకంగా -

– బోజ

# ఇందులో

# ఓనమాలు

విజ్ఞాన యాత్ర అని బ్యానర్‌వున్న స్కూలు విద్యార్థుల వ్యాన్, వారం సరిపోను వంట సామాగ్రితో బయలుదేరి, కొండ ప్రాంతంలో పరుగెడుతూంది రోడ్డు మలుపు ప్రక్కన " నిదానం - ప్రధానం" అని బోర్డు వుంది కొందరు దానిని పెద్దగా చదివారు మరికొందరు చూసి వదిలారు

" ఆ బోర్డు చూశారా?" టీచర్ ప్రశ్నించాడు

" చూశాం సార్" పిల్లలు చెప్పారు

" దాని అర్థం మీకు తెలుసుకదా?" తెలుసన్నట్టు తలలూపారు

" ఏమయ్యా డ్రైవర్‌గారూ! నీకూ తెలుసు కదా?"

" అది రాసింది మా కోసమేనాయె" వెనక్కుమళ్లి చిరునవ్వుతో అన్నాడు డ్రైవర్

" సరే కాని కాస్త ముందుకే చూడు రోడ్డు బాగాలేదు" నవ్వుతూ అన్నాడు టీచర్

"ఇక్కడిది మీ కోసమే కావచ్చు, కాని ఆ వాక్యం అందరికీ వర్తిస్తుంది "

" ఏ పనిలోనైనా నిదానం అవసరం" అందరి వైపు చూస్తూ అన్నాడు టీచర్

" అన్ని పనుల్లో నిదానం అంటే, మరి పనులు కావడం కుదరదు అనుకుంటా సార్"

"అన్ని పనులంటే, పనిని బట్టి వుంటుంది తినేటపుడు నిదానంగా తినాలి, చదివేటపుడు శ్రద్ధగా చదవాలి, మాట్లాడేటప్పుడు విషయాన్ని

బట్టి, ఎదుటివారికి అర్థమయ్యే పదజాలంతో మాట్లాడాలి, నిదానంగా నడవాలి అనుకున్న చోటుకి సకాలంలో చేరాలి అని తొందర తొందరతో పరిగెత్తి నవమన్యలు కొని తెచ్చుకునే కంటే బయలుదేరేటపుడు కాస్త ముందుగ బయలుదేరాలి పిల్లలూ జీవితంలో తెలుసుకోవలసింది చాలా వుంది మీరు పెరుగుతూ కేవలం చదివితేనే సరిపోదు చదువు తెలిపే రహస్యాన్ని తెలుసుకోవాలి చదువులో సారం తెలుసుకోవాలి మీరు శ్రద్ధగా వినండి మీకో చిట్కా చెపుతాను ''

అదేమిటో తనూ వినడానికి డ్రైవర్ వేగాన్ని తగ్గించాడు పిల్లలందరు టీచర్ వైపు ఆసక్తిగా చూస్తున్నారు

" ఏంలేదు చాలా సింపుల్, మూడు ''స''లను గుర్తుంచుకోండి''

అర్థంకానట్లు చూశారుపిల్లలు

" అదేనర్రా- ''స'' ఓనమాలలోని య, ర, ల, వ, స లేదుఅ ''స'' అలాంటి మూడు ''స'' లను గుర్తుంచుకోండి ''స'' ''స'' ''స'' అయితే చెప్పండి అన్నట్టు చూస్తున్నారు

" మొదటి ''స'' సత్యాన్ని పలుకు''

" రెండవ ''స'' సహనాన్ని పాటించు ''

" మూడవ ''స'' సార్'' చంద్రం అడిగాడు

''చెపుతానర్రా- యిక మూడవ''స'' సంతోషాన్ని పెంచు, పంచు,యిదర్రా మూడు'స'ల సూత్రం పిల్లలందరు చప్పట్లు కొట్టారు టీచర్ ముఖం కళకళలాడింది ''ఓ విషయాన్ని,ఓ సారి సూత్రం ద్వారా చెప్తే త్వరగా తలకెక్కుతుంది ఉదాహరణకి ఒకటి ఒకటి రెండు, ఒకటి ఒకటి జీరో ''కరెక్ట్ సార్ యింకా యిలాంటివే చెప్పండి సార్'' ''అలాగే మూడు''నీ'' లు ని,ని,ని, అప్పుడు టీచర్

కాస్త నవ్వును కలబోస్తు సరిగమలు పలికినట్లు పలుకుతూ కుడిచేత్తో తొడమీద దరువు వేసాడు ఈ సారి, పిల్లల్లో ఉత్సాహం ఎక్కువైంది, ఏకాగ్రతతో టీచర్‌వైపు చూస్తున్నారు

"సార్ ఒక ని గూర్చి చెప్పనాండి" కుడి చేయిని లేవనెత్తుతూ అన్నాడు అప్పటివరకు నోరెత్తని జాన్సన్ చెప్పు అన్నట్టు సైగ చేశాడు టీచర్ అందరు అతనివైపు చూస్తున్నారు "ఒక ని, నీతిని మరవొద్దు" అంటూ కదా సార్ అన్నట్టు చూస్తున్నారు "మరో ని ని నేను చెపుతాను సార్" అంటూ లేచి నిలుచున్నాడు మూర్తి చెప్పు అన్నట్టు చూశారు అందరు "ఇంతకుముందు బోర్డ్ చూశాం కదా సార్ నిదానంగా వ్యవహరించు అని అంటూ నవ్వుముఖం పెట్టాడు టీచర్ అదివిని అతని సమయ స్ఫూర్తికి మెచ్చుకోలుగా కనుబొమ్మలు కదిలిస్తూ"శభాశ్" అంటూ కుడిచేతిని పైకెత్తి ఆశీర్వాదపు సైగ చేశాడు "ఇకపోతే మూడవ"ని"ని గూడ మీరే చెప్పండి" అంటూ అందరి వైపు చూశాడు, అందరూ ఒకరి వైపు ఒకరు ఆ తరువాత టీచర్ వైపు చూశారు

హ చెప్పండి అన్నట్టు సైగ చేశాడు టీచర్

మూడవ' ని"తట్టడం లేదు సార్, మీరే చెప్పండి అన్నాడు రెడ్డి అందరు అవునన్నట్టు చూశారు

"మూడవ ని అతి ముఖ్యమైంది నిరాడంబరంగా వుండాలి అంటే ఆడంబరాన్ని ప్రదర్శించవద్దు,మాటల్లోను చేతల్లోను నడకలోను,ప్రతి కదలికలోను సాదా సీదా తనం కనిపించాలి దీనికి మంచి ఉదాహరణ, మన మాజీప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి గారు, వినోభాభావే గారు మొదలగువాళ్ళు మనం మన పూర్వీకులనుండి మంచిని గ్రహించి మన తరంలో ఆచరించి రాబోయే తరాలకు ఆదర్శంగా వుండి సత్ చరిత్ర నిర్మాణానికి పునాది రాళ్ళం కావాలి

“సార్ ముందేదో కెనాల్ వస్తున్నట్టుంది యిక్కడే మనం మధ్యాహ్నం భోజనం సిద్ధం చేసుకుంటే” అన్నాడు డ్రైవర్
కానీయండి అన్నట్టు చూశాడు టీచర్ కాలువ వొడ్డున వ్యాన్ ఆగింది అందరూ దిగారు కొందరు వంట పనిలో నిమగ్నం కాగ మరికొందరు కాలువ గట్టుమీద నిలుచోని పారేనీళ్లలోకి రాళ్లు విసురుతున్నారు విద్యార్థుల గుంపును చూసి రాళ్లు విసురగ ఏర్పడుతున్న నీటి వలయాలను చూసి వొడ్డున వున్న తాబేలు నీటిలోకి జారుకుంది
దూరంగా పొలంలో కలుపుతీస్తున్న ఆడవాళ్లు పాటలు పాడుతున్నారు ఎంత మంచిరాగం ప్రతి పదాన్ని ముందు వొకరు పాడి వొదలగ,మిగతావాళ్లు ఒకేసారి అందుకుంటున్నారు ఆ కలసిపాడే గొంతులలో అలసట పొగొట్టే ఉత్సాహం। పాట రాగమై పరుగులు తీస్తోంది

# నీళ్ల ధార

రోడ్డు పక్కన బోర్‌నీళ్ల పంపు కనపడగానే టీచర్ వ్యాన్ ఆపమని డ్రైవర్‌కు సైగచేశాడు వ్యాన్ ఆగింది

" దప్పిక అయినవాళ్లు వెళ్లి నీళ్లు తాగిరండి" అన్నాడు

వెంకట్, హరి యిద్దరు పంపువైపు నడిచారు వెంకట్ పంపును కొడుతూ వుండగా హరి కాళ్లు చేతులను కడుక్కొని వొంగి దోసిలి పట్టుకొని కడుపునిండా నీళ్లు తాగాడు ఆ తరువాత వెంకట్ పంపును వొదిలి హరిని తీసుకొమ్మని సైగ చేశాడు హరి తడిచేతులను ఓసారి గాలిలో దులిపి వెళ్లి పంపును పట్టుకొని

"చూడు కాళ్లు చేతులు కడుకుంటే కుదరదు,తాగు అంతే"అంటూ పంపును కిందికి పైకి కదిలించాడు నీళ్లధార చాలా సన్నగా వస్తూవుంది అది చూసి వెంకట్ -

"గట్టిగ కొట్టు, నేనూ కాళ్లూ చేతులు కడుక్కుని నీళ్లు తాగిందాక కొట్టు " అన్నాడు కొట్టను అన్నట్టు చూశాడు

ఎందుకు అన్నట్టు చూపుడు వేలు వూపాడు

"ఆలస్యం అవుద్ది"

"నీకు కాలేదా"

" అయింది, నీకు కూడ అయితే వ్యాన్ ఆగుతుందామనకోసం"

"ఆగుతుందిలే కానీయ్"

"హ" అంటు హరి పంపుకొట్టకుండా వ్యాన్‌వైపు పరుగెత్తబోయాడు చుట్టూవున్న కప్పపిల్లలు అటు యిటూ పరుగెత్తాయి వెంకట్ అతన్నే వెంబడించి"ఎందుకు కొట్టవ్‌రా" అంటూ అతని చొక్కాపట్టూకొని నిలదీశాడు

"వొదులు" "వొదలను" "కొడతాను" "తంతాను" ఈ దృశ్యాన్ని చూసిన టీచర్ మిగతా పిల్లలు వ్యాన్ దిగి వచ్చి యిద్దరినీ విడదీస్తూ కారణం అడిగాడు యిద్దరు కోపంగా ఒకరిని ఒకరు చూసుకుంటున్నారే తప్ప నోరు విప్పడం లేదు కొద్దిదూరం బీడులో పశువులను మేపుతున్న కాపరి వీళ్లవైపే చూస్తు నిల్చున్నాడు
ఏమైంది చొక్కాలు పట్టుకున్నారు,ఎందుకు ? అడిగాడు టీచర్ కాస్త విసుగును ప్రదర్శిస్తూ కోపంతో బుసకొడుతూ వొకరినొకరు చూసుకుంటున్నారు "ఎవరు చెప్పరే" మిగతా పిల్లల్లో నుండి ఒకడు అడిగాడు
"వాన్నే చెప్పమనండి" వెంకట్ చూపుడు వేలితో చూపిస్తూ హరి మౌనంగ చూస్తువున్నాడు
"వీడు కాళ్లు చేతులు కడుక్కునే వరకు నేను పంపుకొట్టాను, మరి వీడు నాకుకొట్టడా?"
"కొట్టాలి" ఓ విద్యార్థి చెప్పాడు
"కొట్టడట" దుఖ ం, కోపం రెండు కల్సిన గొంతుతో అన్నాడు వెంకట్
"అంటే"
"ఒక్క తాగడానికే కొడతాడట, కాళ్లూచేతులు కడుక్కోడానికి కొట్టడట"
"అవునా హరి?" టీచర్ ప్రశ్నించాడు
" అవును" అన్నట్టు తలాడించాడు, అమాయకుడిలా హరి
"ఎందుకు?"టీచర్ అడిగాడు
"ఎక్కువసేపు ఆలస్యమైతే వ్యాను వెళ్లిపోతది అని" అప్పుడతని కళ్లల్లో కొంటెతనం కదిలింది
"ఆ విషయం నీవు కడుక్కునేటపుడు నీకు గుర్తులేదా?"
మౌనంగా నీళ్లు తాగినపుడు తడిసిన తన చొక్కా కొనను వేళతో కొడుతు నిలుచున్నాడు హరి

"వీడు మాత్రం ఎంతసేపైనా కడుక్కోవచ్చు" వెంకట్ ఉక్రోషంగా అన్నాడు
"చూడు యిది చాలా చిన్న విషయం కాని పెద్ద సమస్యను సృష్టించింది హరి తనగూర్చే ఆలోచించి యితరుల గూర్చి వదిలేశాడు "
"కాదు సార్ వ్యాన్ వెళ్లిపోతే"--
" అవును ఆలస్యం అవుతే వెళ్లిపోయె అవకాశం వుంది, కాని అందర్ని తీసుకెళ్లవల్సిన బాధ్యత గూడ వుంది "
"డ్రైవర్ హారన్ యిచ్చాడు "
" అది పిలుపు మాత్రమే అయినా నేనున్నానుగా, ఏది ఏమైనా ఈ సమస్యలు తెచ్చిపెట్టే పరిస్థితులను ఎవరూ కల్పించకూడదు ముఖ్యంగా మీకు కల్పించిన ఐదు నిమిషాల వ్యవధిలో యిద్దరు ఒకే తీరుగా తమ తమ పనులను తీర్చుకునే విధంగా మెలగాల్సింది వుండే, అలా కాలేదు కనక కొట్టుకునే వరకు వొచ్చింది ఈ సమస్యలో సమయం గూర్చి మనకు కనిపించినా, యిందులో స్వార్థం,అసహనం యిమిడివున్నాయి ఈ రెండు లక్షణాలను మనిషి మొదట్నించే అదుపుచేసుకోవాలి మనిషితోపాటు అవి పెరిగి మానవున్ని దానవునిగా చేస్తాయి గుర్తుంచుకోండి" అని టీచర్ కదలగానే అందరు వ్యాన్‌వైపు ఆయనతోపాటు నడుస్తున్నారు
"గురజాడ గారు మీకు తెలుసా"?
" తెలుసు సార్ కవి, వారి సూక్తులు మనస్కూల్లో గోడలమీద రాసారు కదా1"
" ఆయన కవి మాత్రమే కాదు, గొప్ప సంఘ సంస్కర్త, కన్యాశుల్కం నాటక రచయిత కూడా"
" ఆయన ఏమన్నాడో ఓసారి గుర్తుచేసుకోండి, 'సొంతలాభం కొంతమాని పొరుగువారికి తోడుపడవోయ్' దానిని ఆచరించక

పోవటం వల్లనే ఈ అరాచకాలు పెరిగిపోతున్నాయి కవి మాటలను కాదనకూడదు, రేపు కాబోయె ఈ దేశపౌరులు మీరు గురజాడ మాటల్లోని అర్థాన్ని గ్రహిస్తేనే భవిష్యత్తుకు బంగారు బాటలు'' అంటూ టీచర్ హరి చేతిలో వెంకట్ చేయిని వుంచాడు యిద్దరు యిలాగే పంపు దగ్గరికి వెళ్లి హరి పంప్ కొట్టగ వెంకట్ కాళ్లు చేతులు కడుక్కొని నీళ్ల తాగాడు ఆ తరువాత అందరు నీళ్లు తాగే వరకు, హరి, వెంకట్ పంప్ కొట్టారు క్లీనర్ క్యాన్ నింపుకొచ్చుకొని కొన్ని రేడియేటర్‌లో పోసి మిగిలిన వాటిని తన కాళ్లదగ్గర పెట్టుకున్నాడు.

ఆ తరువాత పిల్లలందరు కేరింతలు కొడుతూ వ్యాన్ ఎక్కారు

" భద్రంగా కూర్చోండి చేతులు బయటికి పెట్టొద్దు'' అంటూ టీచర్ ఎక్కి కూర్చోగానే వ్యాన్ కదిలింది

" కవుల విషయమెుచ్చింది కనుక చెపుతున్నాను తెలుగు సాహిత్యంలో మన అసలు సిసలు తేటతెలుగులో కవిత్వం చెప్పింది వేమనరా'' టీచర్ అన్నాడు

" ఉప్పుకప్పురంబు ఒక్క పోలికనుండు రాశాడు కదుసార్'' -- రసూల్ అడిగాడు

" చూడ చూడ రుచుల జాడవేరు'' మూర్తి చెప్పాడు

" పురుషులందు పుణ్యపురుషులు వేరయా'' హరి అన్నాడు

వెంటనే పిల్లలంతా కోరస్‌గా "విశ్వదాభిరామ వినురవేమ'' అన్నారు

" ఆ పద్యం చెప్పినాయనే, యింకా యిలాంటివి మనకు ఉపయోగపడే మంచి పద్యాలెన్నో చెప్పాడ్రా నిజంగా ప్రజల సమస్యల గూర్చి రాసిన ప్రజాకవి ఆయనే అంతేకాదు ఆయన ఎన్నో సమస్యల మీద పద్యాలు అల్లాడు మానవజాతికి ఉపయోగపడే గొప్ప కవితా సాహిత్యాన్ని మనకు అందించాడు. వేమన మహాకవి మాత్రమే కాదు విశ్వకవి ''

" కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా" చంద్రం చెప్పాడు
" మీరంతా వేమన శతకం తప్పకుండా కంఠతాపట్టాలి మీకు ముసుముందు చాలా ఉపయోగపడుతుంది "
" టీచర్ విద్యార్థులమధ్య జరుగుతున్న సంభాషణను డ్రైవర్ క్లీనర్ కూడ వింటూ ఉన్నారు యాత్ర మొదలు అయ్యేటపుడు టీచర్ పెట్టిన షరతు " నిదానంగ నడపాలి" అన్న సూచన టీచర్‌ను చూసినపుడల్లా గుర్తు రావడంవల్ల వ్యాన్‌ను మామూలు స్పీడ్‌లో నడుపుతున్నాడు డ్రైవర్ అడవిలో నుండి ప్రయాణం అన్నీ చెట్లు, పొదలు, వాగులు, వొంకలు, అంతా ఆకుపచ్చని అందం సూర్యుడు మబ్బుల చాటున ఉండడంవల్లా పందిరికింద చల్లదనం ప్రకృతి వడిలో పడుకున్నంత హాయి అప్పుడే ఓ త్రాచుపాము నడి రోడ్డులో పరిగెత్తి చూస్తూ వ్యాన్ చప్పుడును గమనించి పక్క పొదల్లోకి జారుకుంది
" పాము, పాము, పాము" పిల్లలు అరిచారు
"పోయింది" అంటూడ్రైవర్ అదిపోయిన వైపు చూస్తున్నాడు
"దాని భయం దానికే" క్లీనర్ అన్నాడు
"వాతావరణం చల్లగా వుంది అందుకని అది బయటికి వచ్చి ఆడుతుంది"
"ఒక వేళ మన బండి చక్రాల కింద పడితే?" మూర్తి అడిగాడు
"చస్తది" టీచర్ చెప్పాడు
" చావకుంటే" జాన్సన్ అనుమానం వ్యక్తం చేశాడు
" పగపడతది" రసూల్ చెప్పాడు
"ప్రత్యేకంగా పగ అంటూ ఏమి వుండదర్రా, చూడండి నిన్నెవరైనా కొట్టితే నీకేమనిపిస్తుంది"
" బాధఅపిస్తుంది"

" అని పిచ్చి"

" మళ్లీ అతన్ని కొట్టాలనిపిస్తుంది"

' కొట్టాలనో తిట్టాలనో అనిపిస్తది ఆయన్ని గుర్తుపెట్టుకుంటే కలిసినపుడల్లా క్రితంలో కొట్టింది గుర్తుకొస్తది మనలో కోపం పుట్టుకొస్తది అవునా"

"అవును సార్ '

" త్రాచుపాముల్లోను అంతే, వాటిని కొట్టినా, బాధించినా తిరగబడతాయి పాముకు చేతులు లేవు మనం కొట్టినట్టు కొట్టలేవు కనుక కాటేస్తుంది మన దగ్గర ఆయుధాలు వున్నట్టు వాటి దగ్గ విషపు కోరలుంటాయి వాటిని ఏమీ అనకపోతే వాటంతవే పోతాయి యిప్పుడు పోలేదా అంతే" టీచర్ చెప్పాడు

" వాటికి మనం భయపడినట్టు అవి మనలను చూసి భయపడతాయి" అన్నాడు డ్రైవర్ పాముల మీద చర్చ సాగుతూనే వుంది విద్యార్థులు తమ అనుమానాలను తెలుసుకుంటున్నారు వ్యాన్ వైపు చూస్తూ చేతులు ఊపారు దూరంగా కనిపిస్తున్న పిల్లలు

# నమ్మకాలు

ఒక మర్రిచెట్టుకింద వ్యాన్ ఆపుకొని అల్పాహారాన్ని తింటూ కూర్చున్న పిల్లల మధ్య టీచర్ కూర్చున్నాడు

" సర్ సార్ " అంటూ పరుగెత్తుకొచ్చాడు జాన్సన్

" ఏమి అన్నట్టు చూశాడు టీచర్ "

" ఆ రసూల్ గాడు చూడండి సార్" అంటూ తాను వచ్చిన వైపు చూపుడు వేలుతో చూపాడు

" ఏం జరిగింది" అంటూ చేతిలోని పులిహోరావున్న ఆకును పక్కకు పెట్టి జాన్సన్‌ను అనుసరించాడు

" సార్ ఒకదాన్ని రాళ్లతో కొట్టి చంపేశాడు యింకోదాన్ని వెంట పడ్డాడు సార్" పోతూ పోతూ ఎగపోస్తు చెపుతున్నాడు

" దేన్నిరా"

" మీరే చూడండి సార్"

టీచర్ జాన్సన్ వెంట నడిచి గుంపుగ వున్న వెుదుగ పొదల్లో తిరగాడుతున్న తొండల్ని రాళ్లతో కొడుతున్నాడు దాన్ని గమనించిన టీచర్

" ఏమ్ రసూల్ ఏమిటిరా ఆ పని?"

" వీటిని చంపాలి సార్"

" ఎందుకు '

జవాబు లేదు

" ఒరే జీవ హింస చేయకూడదని చదవలేదా?"

" అమ్మో వీటిని చంపాలి సార్!" అంటూ రాళ్లు విసురుతునేవున్నాడు

" ఎవరు చెప్పారు" అంటు వెళ్లి అతని చేయి పట్టుకొని ఆపాడు

" వదలండి సార్ అంటూ టీచర్ ముఖంలోకి చూస్తు నిలుచున్నాడు

టీచర్ అతని ముఖంలోకి చూస్తున్నాడు రసూల్ ముఖంలో కసి టీచర్ ముఖంలో పలుచటి చిరునవ్వు
" ఏ ప్రాణిని చంపకూడదు ' అంటూ చచ్చిపడివున్న తొండవైపు జాలిగ చూస్తూ, అతని చేతిని అలాగే పట్టుకొని మర్రిచెట్టు వైపు తీసుకొచ్చాడు ఈ లోపు జరిగిందేమిటా చూద్దాం అని మరికొందరు విద్యార్థులు ఎదురొచ్చారు అందరూ కల్సి మర్రిచెట్టు కిందకు నడిచారు
" రసూల్ తొండను నీవు అనవసరంగా చంపావు అది ఎవరికి హాని చేసేది కాదు విషం కక్కేజీవి కాదు వాటి వెంట ఎందుకు పడ్డావు"
" మాతాత చెప్పాడు గిర్‌గుట్ కనిపిస్తే పత్తర్‌సేమార్నా అని " తనకు వారసత్వంలో వచ్చిన అపురూప రహస్యాన్ని దాచి దాచి చెప్పినట్టు చెప్పాడు
" నో నో అది సాధుజీవి" అంటూ మర్రికొమ్మలవైపు చూశాడు పైన కొమ్మలను కరచుకొని వున్న తొండలు కనిపించాయి
' ఎప్పటినుండో తొండ కనిపించగనే క్రూరంగా రాళ్లతో కొట్టి కొట్టి చంపడం జరుగుతూవుందట ఆ క్రమంలోనే రసూల్ చూడగానే తొండలను రాళ్లతో కొడుతున్నాడు దీనికి అంతం ఎపుడో? ఈ విషయాన్ని గూర్చి అందరం కల్సి ఆలోచించాలి అంతేకాదు అందరం కలిసి ఆపాలి" అంటూ రసూల్‌వైపు చూశాడు రసూల్ మనస్సులో ఏదోకొత్త ఆలోచన కదుల్తూవుంది అవును అమాయకపు జీవి, హాని ఎరుగని ప్రాణిని ఎందుకు కొట్టి చంపుతున్నట్టు? తాత తనకు ఎందుకు చెప్పినట్టు?
" ఏమిటాలోచిస్తున్నావ్" టీచర్ అడిగాడు
" ఏం లేదుసార్ మాతాత ఎందుకలా చెప్పాడా అని"
" వాళ్ల కాలంలో ఏం జరిగిందో, ఎవరు వాళ్లకు అలా చెయ్యమని ఎందుకు చెప్పారో మనకు తెలియదు, అది వాళ్లకే వొదిలేస్తే సరి"
రసూల్ సరే అన్నట్టు తలాడించాడు
" అయితే మనం ఆలోచించవల్సింది ఆచరించవల్సింది, మన కాల ధర్మం మన కాలంలో మన ధర్మాన్ని చెబుతుంది? జీవహింసచేయరాదు

" అంటూ పిల్లలందరివైపు చూశాడు పిల్లలందరు అవునన్నట్టు ఆమోదంతో తలలూపారు రసూల్ ముఖంలోను ఓ కొత్త ఆలోచన కదిలింది

" అందరు ఒక్క దగ్గర్కి రండి ఎండతగ్గగానే యింకొంచెం సేపట్లో బయలుదేరుదాం, అంతకంటె ముందు కాసేపు మాట్లాడుకుందాం" అంటూ అందర్ని రమ్మంటు చేతితో సైగ చేశారు అందరూ టీచర్ చుట్టూ చేరారు వాళ్లంతా పదిహేనేళ్లలోపువారే, పువ్వుల్లాంటి ముఖాలు, పెరిగే వయస్సు, కరిగె మనస్సులు

" చూడండి మనకు బుద్ధుడు ఏంచెప్పాడు, జీవహింస చేయరాదు, అంటే ఏ ప్రాణిని చంపరాదు"

" ఆలోచించి అత్యవసరమైతే, ప్రాణానికి హాని జరిగేటట్టువుంటె చెయ్యొచ్చునేమో కాని అవసరంలేంది చీమలను కూడ" అనే లోపే

" చంపొద్దు కాని మరి దోమల్ని చంపుతున్నాం కదాసార్" మరో విద్యార్థి

టీచర్ నవ్వుతూ " దోమలు మనలను బాధిస్తాయి, మన రక్తాన్ని తాగుతాయి, అంటురోగాలు కలిగిస్తాయి కాబట్టి చంపుతున్నాం ఏ సూత్రానికైనా పట్టు విడుపు వుంటుంది"

"సార్ యిప్పుడు ఈ అడవిలో ఓ పులి మనమీద పడితే" --

" మొదట దానిని పారదోలాలి"

" ఆ అది వూరుకుంటదా, పైన పడి పంజాతో కొట్టదూ"

" అప్పుడు దాన్ని చంపొచ్చు అది క్రూర మృగం "

" అంతేకాని మన జోలికిరాని తొండల్ని, అందమైన తూనీగలను చంపుతారు మీరు క్రింది తరగతుల్లో వున్నపుడు ఎన్ని తూనీగలను చంపారో గుర్తు తెచ్చుకోండి, మూఢనమ్మకాలతో మూర్ఖపుఆనందంతో మరొక ప్రాణికి హాని చేయొద్దుసుమా" అన్నాడు టీచర్ అప్పుడాయన చెట్టుకింద మరో బుద్ధుడా! అనిపించింది అందరికీ

ఆ తరువాత అందరూ అటు యిటూ తిరుగుతూ చెట్టుఎక్కి కాసేపు కోతికొమ్మచ్చి ఆట ఆడుకున్నారు క్లీనర్ మర్రిచెట్టెక్కి తేనెను జోపుకొచ్చి మర్రాకు దొల్లలో పోసిచ్చాడు వెంకట్ వేరే దొల్లల్లో కాస్త ఎక్కువ తేనెను తెచ్చి టీచర్ కిచ్చాడు డ్రైవర్ తెట్టెను తుంచి తలాకాస్త యిస్తూ, మధ్య మధ్య వున్న జిడ్డు తెట్టెను ఒకచోట పెడుతువున్నాడు

నలుగురైదుగురు పక్క చెలుకలో వేపచెట్టుకున్న తేనెను జోపడానికి ప్రయత్నం చేస్తూ వున్నారు అందులో రామిరెడ్డి చెట్టు ఎక్కి తెట్టెను కదిపాడు అంతే తేనెటీగలు అతన్ని కుట్టసాగాయి బాధతో భయంతో చెట్టు దిగి తంగెడుకొమ్మలను యిరుచుకొని వాటి బారినుండి తప్పించుకునే ప్రయత్నం చేసాడు కాని అవి రెడ్డిని అంతసులభంగా వొదలలేదు రెడ్డి వెంటవున్న మూర్తిని గూద కొన్ని ఈగలు కరిచాయి అది చూసిన డ్రైవర్ ముసిముసిగ నవ్వాడు మళ్లీ వ్యాన్ కదిలింది అడవిలో దొరికే ఫలాల గూర్చి తేనె పట్టుల గూర్చి వాటి రుచుల గూర్చి చర్చించుకుంటున్నారు

# చూపు

" సార్ వీళ్లిద్దరు మాట్లాడుకోవటం లేదు సార్" ఓ యిద్దరు పిల్లలు ఫిర్యాదు చేశారు వెంకట్‌రెడ్డిని, చంద్రాన్ని తీసుకొచ్చి టీచర్ ముందు నిలబెట్టారు పుస్తకం చదువుతున్న టీచర్ పేజీల మధ్యన వేలుంచి వాళ్లవైపు కాసేపు మౌనంగా చూశాడు వెంకట్‌రెడ్డి ఖరీదైన టీ షర్ట్, జీన్స్‌ప్యాంట్ వేసి నున్నగా,చలాకిగా వున్నాడు

సాదాసీదా వేషధారణ తొణకని ప్రశాంతమైన చూపులతో చంద్ర తన భుజాలు పట్టుకున్న స్నేహితుల పట్టును వొదిలించుకునే ప్రయత్నం చేస్తున్నాడు

" ఏమిటి సంగతి" యిద్దర్ని ప్రశ్నిస్తున్నట్టు సైగ చేశాడు టీచర్

"వీళ్లు మాట్లాడుకోవడం లేదు సార్" అని మళ్లీ వాళ్లే అన్నారు

"అవునా! అన్నట్టు చూశాడు టీచర్

ఇద్దరూ మౌనంగా చూస్తువున్నారు, తప్ప మాటలు లేవు

" చెప్పరేం? " అడిగాడు టీచర్

అయినా వాళ్లు నోరు విప్పలేదు

" మూగి వాళ్లయ్యరా? నోరు విప్పండి" టీచర్ గద్దించాడు

టీచర్‌నే చూస్తూ చంద్రం, నేలను చూస్తూ రెడ్డి, వాళ్లనే చూస్తూ మిగతావాళ్లు "ఏం రెడ్డి ఎందుకు మాట్లాడుకోవడంలేదు"?

" ఆయన్నే అడగండి"

"చంద్రం నీవన్నా చెప్పు"

" ఆయనే మాట్లాడడం లేదు సార్"

" యింతకుముందు బాగానేవున్నారు కదా? అంటూ మిగతావాళ్లవైపు చూశాడు

" ఉండేది సార్, యిద్దరిదీ ఒకే ఊరు" స్నేహితులుగానే వుండేది
" అలాగా మరెందుకు మాట్లాడుకోవడం లేదు, ఏమన్న పోట్లాడుకున్నారా" యిద్దరి చూపులను మార్చి మార్చి చూస్తు అన్నాడు
" అదే లేదు సార్" చంద్రం అన్నాడు
" ఏం రెడ్డి"? ప్రశ్నించాడు టీచర్
రెడ్డి మాట్లాడలేదు
ఇంతకుముందు బాగ కల్సి మెల్సివుంటూ రెడ్డి, చంద్రం నోట్స్‌ను అడుక్కునేవాడు తన టెక్ట్స్ బుక్స్ చంద్రానికి యిచ్చేవాడు
" మరి యిప్పుడేమైంది"?
" ఊళ్లో ఏదో జరిగిందట సార్" మెల్లగ మూర్తి అన్నాడు
మూర్తి చూడడానికి అమాయకంగా వుంటూనే చుట్టూరవున్న వాళ్ల అందరి సంగతులు ఆరా తీస్తాడు అంతే కాదు వొకరి వెనుక మరొకరిని ఎగతాళిగ మాట్లాడుతువుంటాడు
" ఊళ్లో ఏదో జరిగితే - " టీచర్
" అదే చెప్పమంటున్నాం సార్"
"చూడండి మొదట స్నేహితులే కదా!అయితే స్నేహమంటే మాటలు కాదుఅది" అందరు వింటూ నిలుచున్నారు అది చూసి వ్యాన్ డ్రైవర్ వొచ్చి వాళ్లతోపాటు వింటూ నిలుచున్నాడు క్లీనర్ బండిని తుడుస్తూవున్నాడు
" తోటివారిని ప్రేమించడం అనేది ప్రతివానికి వుండవల్సిన ముఖ్యమైన లక్షణం చాలా మందిలో అదే లోపిస్తున్నది అందువల్ల అన్నీ సమస్యలే! అయినా అన్నెం పున్నెం ఎరుగని, ఆడే పాడే వయసునప్పమీది యింతకు ముందు కల్సివెల్సి తిరిగి యిప్పుడెందుకొచ్చిందటా?"
" వీళ్ల చెప్పరు సార్, వీళ్ళ సంగతి మూర్తికి తప్పక ఎరుకుంటది" రసూల్ అన్నాడు

" రసూల్ అన్నది నిజమేనా, ఏం మూర్తి?"

"ఏం లేదు సార్ వాళ్ల ఊళ్లో చంద్రంవాళ్ల నాన్న, రెడ్డి వాళ్లనాన్న దగ్గర పాలేరట"

"అయితే?"

"ఏదో గొడవ జరిగిందట, చంద్ర వాళ్లనాన్న ఎదురు తిరిగాడట రెడ్డి వాళ్ల నాన్న అయన్ని పనిలో నుండి తీసేసి, తీసుకున్న అప్పును పైసలేకుంట చెల్లించమన్నాడట మొత్తంమీద చాల పెద్ద గొడవే అయిందట" అంటూ యిద్దరి వైపుచూసి, మిగతాది చెపితె ఏమనుకుంటారో ఏమో అని సందేహిస్తూ -- ఆగాడు మూర్తి,

" వీళ్ల నాన్న మా నాన్నను కొట్టాడు సార్" చంద్రం అన్నాడు

" మానాన్న ఊర్కే ఏంకొట్టలేదు" అన్నాడు రెడ్డి

" వూళ్లో వాళ్లు పోట్లాడుకుంటే, ఇక్కడ మీరు పోట్లాడుకోలేదు కదా?' ' అన్నాడు టీచర్ 'లేదు' అన్నట్టు తల వూపారు ఇద్దరూ

" మా నాన్నను కొట్టారని తాను, మానాన్నకు ఎదురు తిరిగాడని నీవు ఎవరకి వారే ఏదేదో అనుకొని ఒకరికొకరు ద్వేషించుకుంటున్నారు కదా?" ఎవరు మాట్లాడలేదు

" చూడండి పిల్లలు, ఇది దురదృష్టకరమైన ధోరణి, తోటివానిని సమానంగా చూసే సంస్కారాన్ని పెంచుకోవాలి రెడ్డీ భూస్వామి కొడుకైనా, చంద్రం పాలేరు కొడుకైనా మాకు అందరు సమానమే, పోగా ఎవరు బాగా చదివి ఎక్కువ మార్కులు సంపాదిస్తే, అతనే ఎక్కువ గుర్తించబడతాడు ఒక పేద పిల్లవాడు బాగా కష్టపడి చదివి డాక్టరో, యింజనీరో, ఐ ఎ ఎస్సో అయితే ఆయన స్థితిమారదూ? అందువల్లా తల్లిదండ్రులకున్న ఆస్తులను చూసుకొని ఎగిరి పడడం అవివేకం రెడ్డీ నీవు చంద్రంతో చేయికలుపు" అంటూ యిద్దరినీ అక్కున చేర్చుకొని తలనిమిరి"యిక పదండి కాస్త చల్లబడదాం" అంటూ అందరూ వ్యాన్వైపు నడిచారు అందరికంటె వెనుక జాన్సన్ రెండు రాళ్లను ఒకదానికి ఒకటి రాపిడి చేస్తూ వొస్తున్న నిప్పు రవ్వలను చూస్తు నడుస్తున్నాడు

# మాటల మూటలు

వ్యాన్ నడుస్తూవుంది, టీచర్ పిల్లలనుద్దేశిస్తూ
" మనం క్విజ్‌ను నడుపుదాం టైం పాస్ అవుద్ది, విషయాలను తెలుసుకోవచ్చు" అన్నాడు టీచర్ సరే అన్నట్టు అందరూ తలలూపారు
" మనిషిలో నిత్యం మనిసిని కాపాడే అవయవం ఏది చెప్పండి" టీచర్ అడిగాడు
" గుండె" ఒక విద్యార్థి తన ఎదమీద చేయివుంచుతూ అన్నాడు
" కాదు అది పనిచేస్తేనే మనిషి, లేకపోతే శవం"
" చేతులు" అన్నాడు తన రెండు చేతులను ఎత్తి చూపిస్తూ యింకో విద్యార్థి
"ఉహు" అంటూ ఓ సారి తన కళ్లను మూసి తెరిచాడు టీచర్
"తల"
" కొంత కరెక్ట్"
"యిక మీరు చెప్పండి సార్" అందరు ఒకేసారి అన్నారు
" మరి మార్కులు నాకే వొస్తాయి కదా?"
" రానీయండి"
" నాలుక" కుడిచేతి చూపుడు వేలితో తన నాలుకను చూపిస్తు అన్నాడు అవును అన్నట్టు ఒకరిముఖాలు వొకరు చూసుకున్నారు నోరు మంచిదైతే ఊరంతా మంచిదే అనేనానుడి మీకు తెలుసుకదా"
అందరు అవునన్నట్టు తలవూపారు
" మరో ప్రశ్న, అన్నిటికంటె శక్తివంతమైన శబ్దం ఏది?"
గొర్రెలమంద అడ్డురావటం వల్లా వ్యాన్ నిధానంగా పోతువుంది

వెంటవున్న కాపరి తనకు పట్టనట్టె ఈల పాట పాడుతు నడుస్తున్నాడు
" చెప్పండి"
' మీరే చెప్పండి స ర్" అన్నారు పిల్లలు
"అన్నీ నేనే చెబితె మరి మీరేమి ఆలోచిస్తున్నట్టు?"
" పోనీ మీకో క్లూ యిస్తాను" అంటుచూపుడు వేలితో పెదాలను తాకుకుంటూ ఏకాగ్రతలోకి వెళ్లి-
" మొదటి ప్రశ్నకు రెండవ ప్రశ్నకు సంబంధం వుంది" అన్నాడు టీచర్ అందరూ ఆలోచనలో పడిపోయి మౌనంగా చూస్తూవున్నారు
"మెదడుకు మేత పెట్టండి"
"తట్టడం లేదు సార్"
" యిది చాలా లొత్తైన ప్రశ్న అలోచిస్తే అదే తట్టుద్ది మీరాలోచిస్తేగా 'మాటుర్రా' 'మాట' అంటూ అందరివైపు చూశారు అందరు అవునన్నట్టు నవ్వుముఖాలు పెట్టారు
" ఇంతకు ముందు నాలుక గూర్చి అనుకున్నాం దానికి సంబంధించిన మాట గూర్చి అయితే మీరు తొందరగా క్యాచ్‌చేస్తారని దీన్ని అడిగాను ఎదుటివాడు మాట్లాడితే మనమీద పనిచేస్తుంది మనం మాట్లాడితే ఎదుటివాని మీద పనిచేస్తుంది మాట అన్నింటికంటె ప్రభావం చూపిస్తుంది అందుకే అది అన్నింటికంటె శక్తివంతమైనది మాట స్నేహాన్ని పెంచుతుంది తెంచుతుంది అందుకే' మంచి మాట వరహాలమూట' అన్నారు పెద్దలు ఒక విషయం గుర్తుంచుకొండి మాట జారితే మళ్లీరాదు మాట అనడానికి తెలివిని ఉపయోగించాలి మాట వినడానికి సహనాన్ని ప్రదర్శించాలి "
"మరో ప్రశ్న వేయండి సార్" చంద్రం అడిగాడు
" వేస్తే ఏం లాభం మీరెవరు చెప్పడం లేదు"
" కొంచెం ఈజీ ప్రశ్నలు వేయండిసార్" రెడ్డి

" అవును సార్" రసూల్

" మనిషికి శోభనిచ్చేవి ఏవి?"

"నగలు"

"కాదు"

"విలువైన వస్త్రాలు"

"ఊహు"

" ధనం" రెడ్డి

కానేకాదు అన్నట్టు తలవూపాడు

" భక్తి" రసూల్ చెప్పాడు

" నహి"

" విద్య" చంద్రం అన్నాడు

" కొంతవరకు కరెక్టే కాని ప్రశ్నకు తగ్గట్టు సమాధానం చెప్పాలి"

"సరే సార్" అన్నట్టు అందరు కాస్త కదిలి కూర్చున్నారు గట్టు, గుట్టల ఏరియారోడ్డు అంతా ఎత్తు పల్లాలు వ్యాన్ నడుస్తూనేవుంది అతలాకుతాలంగా

"చంద్రం చెప్పు దగ్గర్లో వున్నావు"

అందరు అతనివైపు చూశారు

" నాకు తోచింది అంతే సార్"

" మిగతాది నేను చెపుతాను"

చెప్పండి అని అందరు శ్రద్ధగ టీచర్ వైపు చూస్తున్నారు ఏం చెపుతాడో వినాలని డ్రైవర్ బండిని నెమ్మదిగ నడుపుతూ ఓ చెవిని యిటువైపు పెట్టాడు

టీచర్ తన చూపుడు వేలును బొటన వేలికి ఆనించి " వినయ విధేయతలు"

" అవునవును అన్నట్టు" అందరూ వొకరి ముఖం వొకరు చూసుకున్నారు

" ఆభరణాల కంటె, ఆస్తిపాస్తులకంటె విలువైనది "

" పోతే మనిషి మంచిగ బ్రతకాలంటే కావలసినవి ముఖ్య లక్షణాలేమిటి?"

" చెపుతాను సార్ కష్టపడి పనిచేయాలి" చంద్రం అన్నాడు

టీచర్ నవ్వుతూ చూశాడు

" కష్టపడే వాళ్లంతా మంచిగ బతుకుతున్నారు" మధ్యలో కల్పించుకొని క్లీనర్

'అచ్చా' అన్నట్టు చూశాడు డ్రైవర్

" ఆలోచించదగ్గ విషయమే" టీచర్ అన్నాడు

" ఏదన్నా క్లూ యివ్వండి సార్" అన్నారు కొందరు

" యింతకుముందు ప్రశ్న వ్యక్తిత్వానికి సంబంధించినదైతే ఈ ప్రశ్న బ్రతుకుదెరువుకు సంబంధించింది

" పనితనం " వెంకట్ చెప్పాడు

" సగం కరెక్టే, అదే మోస్తరు మరో --"

" అయితే అవిమీరు చెప్పండి సార్" మూర్తి

" మీకు గుర్తుండేటట్లు చెప్పాలంటే, ఓర్పు - నేర్పు" యిది వున్నావాళ్లు దేశంలో ఏమూలనైనా బ్రతుకగలరు పిల్లలు చప్పట్లు కొట్టారు, టీచర్ చిరునవ్వు నవ్వాడు

" పిల్లలూ మీరు సాంఘికశాస్త్రం చదువుతున్నారు కదా"

" అవును సార్"

" మొగల్ చక్రవర్తుల్లో ఈ దేశాన్ని బాగా పరిపాలించిందెవరు?"

" అక్బర్ ' ఒక్కసారే నలుగురి జవాబు

" అచ్చా - చరిత్ర బాగే చదువుతున్నారన్నమాట"

" చదివినపుడు చదివింది గుర్తున్నట్టే వుంటది తరువాత ఆ॥ సం॥ ఏ యుద్ధం ఎపుడు జరిగింది లాంటివి కొన్ని గుర్తుండవు అసలు

చదివిందంతా గుర్తుండాలి, ఏం చెయ్యాలి సార్?'' వెంకట్ ప్రశ్నించాడు

" చదివితే ఎందుకు గుర్తుండదు'' టీచర్ అన్నాడు

" ఆయన చెప్పేది నిజమే సార్ నాకూ అంతే'' మూర్తి

" అంటే శ్రద్ధగా చదవటం లేదన్నమాట చూడండి చదివితే గుర్తుంటది, గుర్తుండేటట్టు చదవాలి అర్థం కానిదాన్ని ఒకటికి రెండుసార్లు చదవాలి ఈ ప్రాబ్లమ్ చాలా మందిలోను వుంటుంది దీనికి ముందు ఒకటే ప్రశాంతంగా, ఏకాగ్రతతో చదవాలి చదివినదాన్ని ఓ సారి మననం చేసుకోవాలి పాఠం బాగా గుర్తుండాలి అంటే టీచర్ చెప్పేటప్పుడు సరిగ్గా వినాలర్రా! విన్నదానిని అదే రోజు రెండు మూడు మార్లు చదవాలి అంతే యిక దానిని మీరు మరవాలన్నా మరవలేరు దేనికైన సాధన చాలా అవసరం సాధించలేనిది ఏం లేదు '' చెప్పాడు టీచర్

అందరూ చప్పట్లు కొట్టారు

" ఇందాక మీరు అక్బర్ పేరు చెప్పారు కదా! ఆయన స్థాపించిన మతమేదో చెబుతారా?'' " దీన్ -ఇ- ఇలాహీ'' అన్నాడు రెడ్డి

" గుడ్ దానర్థం తెలుసా ఎవరికైనా'' కలయజూస్తు అన్నాడు టీచర్

పిల్లలు తెల్లమోహం వేశారు

" దీన్ అంటె మతం''

" ఇలాహి అంటె భగవంతుడు''

" ఆ అదే భగవంతుని మతం అని అర్థం అందరూ కలసి బ్రతకాలి ఆనాటి నుండి సాగుతున్న ఆలోచనే, మనం దానికి ఆచరణలో పెట్టాలి అంతే కలసి వుంటే కలదు సుఖం

" సార్ ఎదురుగ ఏదో హోటల్ వున్నట్టుంది ఆపమంటారా''

" ఆపు'' టీచర్ అన్నాడు

వ్యాన్ ఆగింది అందరూ దిగారు, టీచర్ ముందుగ వెళ్లి అందరికీ 'టీ' అర్డరిచ్చాడు పిల్లలు అవసరాలు తీర్చుకోవడానికి ఇటూ అటూ వెళుతున్నారు ఒకడు తంగెడు పూలను తెంపుతున్నాడు మరొకడు అక్కడ పడివున్న తాటికాయను ఫుట్‌బాల్‌ను తన్నుకు వచ్చినట్టు తన్నుకొస్తున్నాడు

" టీ రడీ రండి'' టీచర్ కేకపెట్టాడు

అది విని అందరూ టీ టేబుల్ చుట్టూర చేరి తలా ఓ గ్లాసు అందుకున్నారు టీ తాగుతూనే డ్రైవర్, టీచర్ రేపటి ప్రయాణం గూర్చి చర్చించుకుంటున్నారు కొందరు విద్యార్థులు షుగర్ తక్కువుందని హోటల్‌వానితో తగువుకు దిగుతున్నారు అది గమనించిన టీచర్ వాళ్లను సమీపించి, చల్లపరచి వ్యాన్ వైపు నడిచారు

# చర్చ

చీకటి పడుతున్న వేళ వర్షం పడుతూవుంది
" ఏం వేగాన్ని తగ్గించావు" టిచర్ అడిగాడు డ్రైవర్ని"
" వైపర్స్ పనిచేయడం లేదుసార్' క్లీనర్ చెప్పాడు
" రిపేర్ చెయ్యొచ్చుగ" ఓ విద్యార్థి సూచించాడు
"యిప్పుడు కుదరదు, కాస్త ఆపు గురూ! దాన్ని రుద్దుతాను" అన్నాడు క్లీనర్
వ్యాన్ ఆగింది, క్లీనర్ దిగి వ్యాన్ ముందుకు నడిచాడు
దేన్ని రుద్దుతాడో అని అందరు ఆసక్తిగ చూస్తున్నారు
క్లీనర్ జేబులోనుండి ఓ సిగరెట్ తీసి తుంచి డ్రైవర్ ముందు అద్దానికి రుద్ది తిరుగొచ్చి తనసీట్లో కూర్చొని 'రైట్' అన్నాడు
వ్యాన్ కదిలింది, పొగాకు రుద్దినంత మేరకు నీటి చుక్కలు నిలవకుండ రాలిపోతున్నవి రోడ్డు క్లియర్గ కనిపిస్తుంది వ్యాన్ వేగం కాస్త పెరిగింది
విద్యార్థులతో పాటు, టీచర్ ఓ కొత్త విషయాన్ని తెలుకున్నట్టు చూస్తూ
" ఒక వేళ సిగరేటు ఉండదనుకో అప్పుడు?' అడిగాడు టీచర్
" పొగాకు లేకుంటే, యింత బట్టల సబ్బును రుద్దాలి" అన్నాడు డ్రైవర్
" మంచి ఐడియా" టీచర్ మెచ్చుకున్నాడు
కొన్ని కిలో మీటర్లు వచ్చినాక వర్షం లేనేలేదు
రోడ్డు పక్కమ్మటే వ్యవసాయబావి, పశువుల కొట్టం, కొట్టానికి కొంత దూరంలో తగలబడుతున్న గడ్డివాము కాలుతు మంటలు పైకిలేస్తూ చివర్న నల్లని పొగ, పొగతోపాటు లేచి చుట్టూర పరుచుకుంటున్న కాలిన గడ్డిపోచల బూడిద ముక్కలు అక్కడ ఎవరు వున్నట్టు కదిలికలు లేవు
' వ్యాన్ ఆపు" టీచర్
వ్యాన్ ఆగింది, అందరు దిగారు " పశువులమేత తగలబడి పోతుందే

ఎవరు లేనట్టుంది పదండి'' టీచర్ అన్నాడు ఉవ్వెత్తున లేస్తున్న మంటలకు పశువులు అరుస్తున్నాయి బావికి అమర్చిన పంపునీళ్లు పడే చోట కాలువచెడి ఓ మడుగులాగ తయారైంది పక్కనే వున్న మట్టి గోలెం, రెండు నీళ్ల కుండలు వున్నాయి విధ్యార్థుల్లో కొందరు నిప్పును ఎలా ఆర్పాలి అని ఆలోచిస్తూ, తోచిన మేరకు తమ ప్రయత్నాలను మొదలు పెట్టారు

టీచర్ ఏదేదో చెపుతు వున్నాడు యిద్దరు నీళ్లకుండలు తీసుకొని మడుగులో ముంచుకొచ్చి చల్లుతున్నారు మరికొందరు అక్కడవున్న కర్రలు అందుకని కాలుతున్న గడ్డిని జారకొడుతున్నారు ఈలోపు పక్క బావుల దగ్గర వున్న వాళ్లు పరుగెత్తుకొచ్చారు, మోటార్ స్టార్టర్వున్న రేకు డబ్బా తాళాన్ని పగులగొట్టి పంపును స్టార్ట్ చేశారు

నీళ్లే నీళ్లు --

మంటలారిపోయాయి నిప్పు చల్లారింది

'' ఎవరు పెట్టారు ఈ నిప్పు'' టీచర్ ప్రశ్నించాడు

'' తెలవదు ' అని అక్కడికొచ్చినవాళ్లు జవాబు చెప్పారు

'' మొత్తం మీద ఎవరో గిట్టనివాళ్లు చేసిన పనే యిది''ప్రక్కబావి పెద్దమనిషి అనుమానం వ్యక్తం చేశాడు మనిషి గిట్టకపోతే పశువుల మేతను తగులబెగితే ఏమొస్తుంది టీచర్

''అంత ఎవరాలోచిస్తారు తంఢ్రీ, యిష్టంలేని మనిషి కనక నష్టం చెయ్యాలంతే ''

''ఈర్ష్య, ఓర్వలేనితనంతో తాను బాగుపడడం, పక్కవాన్ని బాగుపడనీయడు''

''ఆ నిప్పు పెట్టిందెవరో తెలిస్తే, బాగుండేది సార్'' మూర్తి అన్నాడు

'' తెలుసు బాబు తెలుసు తెలిస్తే ఏం చేస్తాం?'' పెద్దమనిషి నిట్టూర్చాడు

'' మీరు ఊర్కున్నారు మేమైతేనా? ఓ విద్యార్థి ఆవేశంగా అన్నాడు

'''వాన్నిపట్టుకొని ' మరోవిద్యార్థి పళ్లుకొరికాడు

" ఏమొస్తది బాబూ! తగులబడ్డ గడ్డి తిరిగి రాదు గదా" ఓ ముసలాయన అన్నాడు

" అంటే తప్పు చేసినవాణ్ణి వదిలేయాలా?" ప్రశ్నించాడు ఒక విద్యార్థి

ఎట్ల చెపితే అర్థమౌతది, ఏం చెపితే ఏం లాభం అన్నట్టు చూశాడు అందరి వైపు ఆ పెద్దమనిషి

" మా పట్టణాలలో అయితేనా?" అన్నాడు మూర్తి పెద్ద మనిషి ఓ మాదిరిగా నవ్వాడు ఓ ఋషి నవ్వినట్టు కనిపించింది ఆ నవ్వు

" చూడండి బాబులు పట్టణాల్లో గూడా బంగ్లాలు కూలి పోతునే వున్నాయి పట్టపగలే ఆస్తులు కాలిపోతునే వున్నాయి "

" అది కాదు" మూర్తి కలుగజేసుకుని అన్నాడు

" ఏది కాదు నేను చెపుతా పదండి" టీచర్ అన్నాడు

" అసలు నరుడే రాక్షసుడు అయిపోతుండు "

టీచర్ ఆలోచనతో కూడిన చిరునవ్వు నవ్వి అక్కడినుండి కదిలి వ్యాన్ వైపు నడిచాడు అందరు ఆయన్ని అనుసరించారు

అందరు ఎక్కి కూర్చున్నాక వ్యాన్ కదిలింది

ఈ మనుషులు, ఈ సంఘం, ఈ సమాజం గూర్చి వీళ్లలో రావలసిన మంచి మార్పు ఓర్పు గూర్చి రేపటి పౌరులుగ, నవసమాజ స్థాపన గూర్చి తోవ పొడుగూత రకరకాల కొత్త ఆలోచనలు, చర్చలు సాగుతునే వున్నాయి వ్యాన్ నడుస్తూనే వుంది

# రక్తపు మరకలు

మధ్యాహ్నం రెండు కావస్తుంది
జాతీయ రహదారి మీద పరుగెడుతున్న వ్యాన్ స్లో అయింది
ఎదురుగా రోడ్డుకు పర్లాంగు దూరంలో ఓ బోడు దాని మీద తేనె
పట్టుకు వాలిన తేనె టీగల్లాగ జనం పూనకంతో ఊగుతున్న వాళ్ల
కొందరైతే డోల్‌వాయిస్తు తాళాలను వేస్తు కొందరు
మధ్యన ఓ గుండ్రని రాయిపై పసుపు కుంకుమ చల్లబడివుంది
దాని ఎదురుగ లెక్కపెట్ట లేనన్ని దీపాల ప్రమిదలు, అగరొత్తు
పొగలు చుట్టూర కళ్లు తెరిచి, నాలుక బయటికి వేలాడే గొర్రెల,
మేకల తెగిపడ్డ తలకాయలు, మేడి చెట్టు క్రింద రాలిన మేడి పండ్లు
లాగ అక్కడంతా పర్చుకొని వున్నాయి
అక్కడి నేలంతా నెత్తురు చిత్తడి, రక్తం వాసన, దగ్గరికిరాగానే "
ఆపు" అన్నాడు టీచర్ వ్యాన్‌ఆగింది
అందరు వ్యాన్ దిగి, చుట్టు చూశారు ఎటూ కనుచూపుమేర జనమే
జనం ఎడ్ల బళ్ళు బారులు తీరివున్నాయి బళ్ళ ప్రక్కనే వంట
చేసుకొనే ఏర్పాట్లు జరుగుతున్నాయి పొయ్యిలు రాజుతునే
వున్నాయి ఆడవాళ్ళు బిందెలతో నీళ్ళ తెస్తున్నారు మగవాళ్ళు
మాంసాన్ని ముక్కలు చేస్తూవున్నారు రోడ్డు ప్రక్కనే కొత్త కుండలు
అమ్ముతున్న కుమ్మరితో సంభాషణ సాగించాడు టీచర్
"యిక్కడ ఏం జరుగుతూవుంది" టీచర్ ప్రశ్నించాడు
" జాతర" ఇక్కడ రెండేండ్ల కొకసారి పెద్ద జాతర జరుగుతూంది
దీన్ని గట్టు జాతర అంటారు దీనిని మొదట యాదవులే జరిపేదట
ఇప్పుడు అందరు వస్తూంటరు అన్నాడు కుమ్మరి

" అట్లానా" టీచర్ తలవూపుతూ అన్నాడు
" సార్ ఎంత రక్తం?" ఒక విద్యార్థి ఆశ్చర్యంగా అన్నాడు
" అన్ని యాటల నర్కినంక యిగ రక్తముండదా" కుమ్మరి అన్నాడు
అందరు బోడు వైపు చూస్తు నిలుచున్నారు
అక్కడ డోల్ చప్పుడు మారు మ్రోగుతోంది దానికి తోడు వున్న తాళాల చప్పుడు కల్లు - సారల, సాకలు బోడు మీద నుండి చిన్న చిన్న పాయలుగా కిందికి జారుతున్నవి తాగిన మత్తులో జనం వూగుతున్నారు ఆడా మగా తేడాలేదు పూనకం వచ్చి వందల మంది వంటి మీద గుడ్డల సోయి లేకుండా వూగుతున్నారు
వంటిమీదంతా పసుపు -కుంకుమ, నడుముల చుట్టు మువ్వలు పాదాల నుండి మోకాల్ల వరకు మువ్వలు గల పట్టీలను కట్టుకున్నారు
" ఇదొక అజ్ఞానపు ఆనందం, దేవుని పేరుతో జరిగే మూఢాచారపు బలి" అన్నాడు టీచర్ నిరసనగా
"సార్ ఎంత జనమొచ్చారో చూడండి" చుట్టూ చూస్తూ అన్నాడు మూర్తి
" ఆరక్తాన్ని చూస్తే కళ్లు తిర్గుతున్నాయి సార్" అన్నాడు శర్మ
" ఈ గొర్రెల మాంసానంతా తింటారాసార్" అన్నాడు మూర్తి
"అదిగో వంటలు జరుగుతూనే వున్నాయి" అంటూ చుట్టూర మండుతున్న పొయ్యిలను చూపించాడు కుమ్మరి
" వీళ్లంతా చదువుకుంటే బాగుండు, యిలా చేయకపోదురు" శర్మ
అవును అన్నట్టు తల ఆడించాడు టీచర్ అక్కడక్కడా పోలీసువాళ్లు చెట్లకింద నిలుని చోద్యం చూస్తున్నారు
ఉన్నట్టుండి శర్మ టీచర్ ముందుకొచ్చి "ఇంత అజ్ఞానంగా యింత బీభత్సంగా జంతుబలి జరగకుండా ప్రభుత్వము చర్యతీసుకోవాలి గదా సార్" అన్నాడు

" పేపర్లో చూడలేదూ? ఆ పని చేస్తునే వున్నారనుకో! అయినా జనం చేస్తున్నది తప్పు అని వాళ్లు తెలుసుకుంటేనే ఆగుతుంది తప్పా, చట్టాలతో మాయమయ్యే ఆచారాలు కావు " అన్నాడు టీచర్

"అట్లా గూడ చేసి చూసింర్రయా" అంటూ కుమ్మరి టీచర్‌వైపు మళ్ళి చెప్ప సాగాడు

"ప్రభుత్వం జంతుబలిని నిషేధించింది జంతుబలి ఇవ్వకూడదని ఎంతో ప్రచారం చేశారు గట్టి బందోబస్తు ఏర్పాటు చేశారు సందేళ జాతర మొదలైంది పోలీసులు ఎవ్వరు కూడ మేకలను, గొర్రెలను నర్కొద్దు అని మైక్‌పెట్టి చెప్తునే వున్నారు సరే అని బోనాలు పెట్టి కల్లు - సారాను అరపోస్తం అని సోకలు పెడుతు వున్నారు

రాత్రి పదైంది, పదకొండు అయ్యింది వొట్టి బోనాలు నే కదా!

"హమ్మయ్య" అని పోలీసులు టోపీలను చేతుల్లోకి తీసుకొని, లారీలను కింద పడేసి అక్కడ అక్కడ కూర్చున్నారు ఆపేటందుకు వొచ్చిన సర్కారు ఆఫీసర్లు కాస్త ఊపిరి పీల్చుకుంటున్నారు

పన్నెండు అయ్యింది

బోడు మీద ఒక్కసారే డోల్‌దెబ్బ మోగింది

అంతట "ఓలింగ" అంటూ కేకలు అరుపులు

రెప్పపాటు జీవాలను ఎత్తుకొని మిడతల్లాగ జనం బోడు చుట్టు చేరారు

ఈ సారి బోడు మీద " ఓ లింగా" అని అరుపు

అంతే " అంబా, అంబా" అని వేలాది జీవాల అరుపు

అక్కడ భూమి, చెట్టు పుట్ట అంతా ఎరుపే ఎరుపు

పోలీసులు టోపి పెట్టుకుని లారీ అందుకునే లోపే అంతా జర్గిపోయింది

ఆపాలని వొచ్చిన అఫీసర్లంతా రెప్పకొట్టకుండా చూసస్తా నిలుచున్నారు

" ఇంత జీవ హింస ఏ దేవుడు కోరుతాడు సార్" శర్మ

" దేవునికి కోరికలుంటాయా ఏమన్ననా। మనిషి కోరికలే దేవుని పేరుతో చేస్తూవుంటారు "

టీచర్ వ్యాన్‌వైపు నడువగా, అందరు ఆయనను అనుసరించారు

" బుద్దుని భూతదయ, గాంధి అహింస" అని మూర్తి అనే లోపే --

"అవన్నీ క్లాస్‌రూమ్ పాఠాలు"

" పోనీ" అన్నాడు టీచర్

వ్యాన్ కదిలింది

విద్యార్థులు మాత్రం కదలకుండా కూర్చున్నారు కాని వాళ్ల బుర్రలనిండా కదిలే ఆలోచనలే

# అడ్డదారులు

అంతవరకు పరుగెత్తుకొచ్చిన వ్యాను ఒక్కసారి ఆగింది ముందు అన్నిరకాల వాహనాలు బస్సులు, కార్లు, లారీలు వరుసగా ఆగివున్నాయి బస్సులో నుండి కొందరు ప్రయాణీకులు దిగి ముందు ఏంజర్గుతుందా అని చూస్తూ నిలుచున్నారు

" ఏమిటి? టీచర్ డ్రైవర్ని అడిగాడు

"ఏమో సార్, బండ్లన్నీ ఆగి వున్నాయి " డ్రైవర్ చెప్పాడు

" ఏదన్నా యాక్సిడెంటా"

ఈలోపు క్లీనర్ వ్యాన్ దిగి రోడ్డు ప్రక్కమ్మటి కొంత దూరము నడిచి విషయము తెలుసుకొని తిరిగొచ్చి" రాస్తారోకొ చేస్తుండు ' వ్యాన్ దగ్గరికొచ్చి టైర్లను చూసి కొట్టి చెప్పాడు

"ఎప్పుడు కదలాలి" అంటూ డ్రైవర్ దిగాడు

ఆ తర్వాత టీచర్, పిల్లలు అందరు దిగారు అందరు రాస్తారోకో వాళ్ల దగ్గరికి నడిచారు రోడ్డు కడ్డంగా పిల్లలు పెద్దలు కూర్చొని నినాదాలు యిస్తూవున్నారు

"ఫలానావాడి దౌర్జన్యము" అంటూ ఒకడు అరిచాడు

" నశించాలి" అంటూ వందల గొంతులు కేకలుపెట్టాయి

"అసమర్థ పాలకులు"

"గద్దె దిగాలి"

పెటపెటలాడే ఎండలో ఓ చెట్టు నీడను చూసుకొని ధర్నా చేసేవాల్లు కూర్చున్నారు వాహనాలన్నీ ఆ ఎర్రటి ఎండలో ఆగివున్నాయి బస్సుల్లోని వాల్లు 'దూప దూప' అంటు తమలో తామే గొణుగుకుంటూ వున్నారు లారీ డ్రైవర్లు తోచిన భాషలో అటు ప్రభుత్వాన్ని యిటు అందోళనకారులను లిడుతువున్నారు

" తల్లితోబాటు పిల్లగూడ బయటికి రాలేక చనిపోయిందట" అన్నాడు డ్రైవర్

'అయ్యో" అంటూ బరువైన శ్వాస వదిలాడు టీచర్ అందరి ముఖాలలోను ఓ విషాదం చోటు చేసుకుంది

" చెప్పేటోడు లేక చెడిపోయినట్టు యిట్టుంటే ఎట్టా సార్, ప్రతి చిన్న చిన్న దానికి దర్నా రాస్తారోకో అయితే ఈ దేశం ఎట్టా బాగుపడతది" అంటూ వ్యాన్ స్టార్ట్ చేశాడు డ్రైవర్ విద్యార్థులకు తాము చేసిన ధర్నాలు గుర్తొచ్చి సిగ్గుపడుతు యిలాంటి అనవసరపు వాటిల్లో పాల్గొనవద్దు, ప్రోత్సహించొద్దు అనుకున్నారు

" ఒకప్పుడు దేశస్వాతంత్ర్యము పొందడానికి పరదేశీలయులపై ప్రయోగించిన పద్ధతులను ఇప్పుడు మనమీద మనమే చీటికి మాటికి వాడుకుంటు ప్రమాదాలను పెంచుకుంటున్నాం ఏది ఎప్పుడు చెయ్యాలో ఎప్పుడు చేయకూడదో తెలుకొని మసలుకోక పోతే ఎట్టా ?"

ఏదేని అన్యాయం జర్గినపుడు, ప్రభుత్వము పట్టించుకోవల్సిన దాన్ని పట్టించుకోనపుడు నిరసన తెలియజేయవల్సిందే అయితే ఆ పద్ధతి ఇతరులకు ఇబ్బంది కల్గించకూడదు ఒకరి హక్కు సాధించడానికి మరి కొందరి హక్కులను హరించకూడదు" అని కాస్త కదిలి కూర్చుంటు " ఆ పోనీ" అన్నాడు టీచర్

వ్యాను కదిలింది

# సంబందాలు

మధ్యాన్నం ఎండ మండిపోతోంది
చుట్టూర చూస్తు వుంటె నీటి అలలాగ ఎండల అగడు
రోడ్డు మీద వాహనాల రాకపోకలు తగ్గినయి రోడ్డుకు ఇరుప్రక్కల మోదుగు చెట్లపొదలు డెబ్బదేండ్ల వృద్దురాలు, పొట్లకాయల్లాంటి కాళ్ల - రెక్కలు, వాటికి అంటుకొని వున్న ముడతలు పడ్డ చర్మం నెత్తిన మోదుగు ఆకులు మూట చేతిలో కర్రతో రోడ్డు దాటాలని నిలుచోని వస్తున్న వ్యాన్ వైపు చూస్తువుంది
ఆమెను చూడగానే" వ్యాన్ ఆపు" అన్నాడు టీచర్
ఎదురుగ రోడ్డు ప్రక్కన్నే వున్న ఓ చెట్టు క్రింద వ్యాన్ ఆగింది
టీచర్ దిగి " రా, ఈ చెట్టు కిందికిరా" అని ఆ ముసలమ్మకు సైగచేశాడు
ముసలమ్మ చెట్టుకిందికి వచ్చింది
ఈ లోపు అందరు దిగారు
క్లీనర్ బానెట్ లేపి రేడియెటర్‌లో నీళ్లు పోసుకున్నాడు
ముసలమ్మ చెట్టుకిందికి చేరింది
" ఏ వూరు" అన్నాడు టీచర్
రోడ్డు అవతల బోడు ప్రక్కన వున్న గూడాన్ని చూపించింది
" ఈ ఆకులెందుకు" అంటు తలమీది ఆకులను చూస్తు అడిగాడు టీచర్
పిల్లలంతా చుట్టూ మూగి ముసలమ్మతో టీచర్ సంబాషణ వింటున్నారు
"ఆకులా, యిస్తర్లు కుడితందుకు"
"విస్తళ్లు ఎందుకు"
ఆమె చిన్నగా నవ్వింది నవ్వినపుడు ముఖంలోని ముడతలన్నీ వల కదిలినట్టు కదిలాయి నోట్లో పళ్లు యింకా వున్నాయి

" ఆ మూట కాస్త దింపుకో పోదువుగాని" అన్నాడు పిల్లలు ఆమె తలమీది మూటను కిందికి దించారు

" నీ కెన్నేండ్లున్నయి"

" తెలవదు" అన్నట్టు చేయి కదిలించింది పాపం వీళ్ల నాన్న ఈమె డేటాఫ్ బర్త్ రాసి వుంచనట్టుంది, అనుకున్నారు పిల్లలు

"ఇంత వయస్సులో, యింత ఎండలో ఈ ఆకులు తెంపడం ఎందుకు" అడిగాడు టీచర్ పొట్టకోసం అన్నట్టు ఎడమచేత్తో కడుపును లాకి చూపించింది డొక్క వెన్నుకు అంటుకపోయివుంది

" కొడుకులు - బిడ్డలు లేరా " డ్రైవర్ అడిగాడు

"ఉన్నరు" అని బరువైన శ్వాసవొదిలింది

"నీకు తిండి పెట్టరా"

పెట్టరు అన్నట్టు అరచేతిని అటు ఇటు తిప్పింది కుడిచేతిలోని కఱ్రతో చుట్టు చూపిస్తు

"ఈ మోదుగు చెట్లు నా కొడుకులు బిడ్డలు వీటి ఆకులను తీసు కపోయి యిస్తల్లు కుట్టి అమ్ముకొని పూటెల్లదీస్త " అంది అప్పుడు ఆమె కళ్లు తడి అయ్యాయి

"కొడుకు వున్నంక యింత కష్టం ఎందుకు పడాలి"

" కొడుకు నా కొడుకైతె కోడలు ? కొడుకు పెట్టమన్న కోడలు పెట్టొద్దు "

" నీకొడుకు చెప్పడా"

"కోడలు చెప్పినట్టె కొడుకింటడు" అన్నపుడు ఏదోనిరాశ అమె బరువైన శ్వాస ద్వారా బయటి కొచ్చింది అపుడామె కఱ్రను ఎడమ చేలిలోకి మార్చుకొని, భూమికి ఆనించి కుడి చేతిలో ఎడమ చేతికి వున్న రాతెండి గొట్లను కదిలించుకుంటు గతంలోకి ఎల్లి పోయినట్టుంది

గుండెలో నుండి దు ఖం తన్నుకొచ్చి ముఖంలో విషాదం చోటు చేసుకుంది

" నా దీపం వున్నంగానే నా బ్రతుకులో ఎలుగు వుండె, ఆయున సచ్చిపోయి నన్ను అడవి పాలు సేసిండు ' అన్నప్పుడు ఆమె గొంతు బొంగురుపోయింది

చుట్టూ చేరి ఆసక్తిగ వింటున్న విద్యార్థులు ఆర్ద్రతతో కదిలి పోయారు వాళ్ల వాళ్ల ఇండ్లల్లలో అమ్మమ్మలు, నాయనమ్మలు గుర్తొచ్చారు వాళ్ల పట్ల వాళ్ల వాళ్ల తల్లి - తండ్రులు చూపె ఆదరణ - నిరాదరణ గుర్తురాసాగింది

" ఈ రోజు అన్నం తిన్నావా" అని అడిగాడు టీచర్

" యింటికి పోయి తింట" అంది

" మన దగ్గర బిస్కెట్స్ వున్నాయిగ, తెచ్చియివ్వండి" అన్నాడు టీచర్

ఓ విద్యార్థి వెళ్లి బిస్కెట్స్ పాకెట్‌ను తెచ్చి యిచ్చాడు అందరికి చేతులు జోడించి దానిని తీసుకుంటు వొళ్లో దాచుకుంది

" తినడానికి యిచ్చాము దాచుకుంటావ్" అన్నాడు విద్యార్థి

" ఇంటికి పోయి తింట"

"ఇప్పుడె తిను" అన్నాడు విద్యార్థి

"ఇంటి దగ్గరి నా మనమడున్నాడు"

" కొడుకు కొడుకా"

" అవును కాల్లుమొక్కుత" బిస్కెట్ ప్యాకెట్‌ను సరిగ రొండికి చేక్కుంటు అంది

"నీ కొడుకు నీకు తిండి పెట్టడం లేదు గదా అయన కొడుకు గురించి నీ కెందుకు " అన్నాడు విద్యార్థి

" సంటోడు, అన్నెం - పున్నెం ఎరగనోడు" అంది బ్రతిమాలినట్టు

"తల్లి మనస్సు అంతె పదండి పోదాం" అంటు వ్యాన్ వైపు నడిచాడు టీచర్

పిల్లలు ఆమె మూటను నెత్తిన పెట్టి అక్కడి నుండి కదిలారు

" మా అయ్యేలారా సల్లగ బతకండ్రి" అంటు వాళ్లు వెళ్లిన వైపు చేతులెత్తి మొక్కింది

వ్యాన్ కదిలింది

" సర్, ముసలమ్మ ఎర్రటి ఎండలో మోదుగు ఆకులు తెంపడానికి ఎందుకు అడవికొచ్చిందో '

" పొట్టకోసం" అన్నాడు టీచర్
"తల్లికి అన్నం బెట్టని కొడుకులుంటారా సార్ అన్నాడు శర్మ
"మీరే తెలుసుకొండి, మీ మీ ఇండ్లల్లో, మీ వాడల్లో చూస్తూవుంటే మీకే కనిపిస్తు వుంటారు " అన్నాడు టీచర్ ఒకరిద్దరు తమ తల్లులను గుర్తుచేసుకుని గుటకలు మింగారు మరి కొందరికి తమ తమ ఇండ్లలో తండ్రుల ప్రవర్తన గుర్తొచ్చి బరువుగ శ్వాసవొదిలారు
" పిల్లలూ మానవ సంబంధాలలో ఈలాంటి అమానవీయత చోటు చేసుకోవడం, పల్లెలో కుటుంబ జీవితాలు అస్తవ్యస్తం కావటం ఆత్మ హత్యల వరకు దారి తీస్తున్నాయి" అన్నాడు టీచర్
పిల్లల శ్రద్ధగ వింటున్నారు
"అందుకే పెద్దలు ఓ కథ చెపుతారు కదా సార్" డ్రైవర్
"ఏం కథ ' టీచర్
" రామయ్య అనే వ్యక్తి తాను తన భార్య పిల్లలు కంచాలలో తింటూ తండ్రికి ఓ చిప్పలో పెట్టేవాడట, ఆ వృద్ధుడు ఆ చిప్పలో రోజు తింటూ కడిగి అతి జాగ్రత్తగ దడిలో దాచుకునేవాడట అనుకోకుండా ఓ రోజు చేయిజారి చిప్ప పగిలిందట అది చూసిన రామయ్య కొడుకు, అయ్యో తాతయ్య చిప్పను పగులగొట్టావా? నాన్నకోసం మరో కొత్త చిప్పకొనాలా? నాన్నా నీవు ముసలవాడవైనాక దేంట్లో తింటావు అంటాడట తండ్రితో అంతే - తండ్రి నివ్వేరపోయి నిలుచుంటాడట" అని ముగిస్తాడు డ్రైవర్
'అది మానవ సంబంధాల గురించి గొప్ప గుణపాఠం చెప్పే కథ మమతలు మరిచే వ్యక్తికి కనువిప్పు కలిగించె కథ ఈ కథ రాసిన రచయితకు మనం కృతజ్ఞతలు చెప్పుకోవాలిగ" అన్నాడు టీచర్

# పాలు - నీళ్లు

" మనం ఈరోజు చాలదూరం ప్రయాణం చేయవల్సివుంది ఏదేని విషయం మీద చర్చించుకుందాం" అన్నాడు టీచర్
పిల్లలు ఉత్సాహంగ 'సరే' అంటు సర్దుకుని కూర్చున్నారు
వాళ్ల ఉత్సాహాన్ని గమనించిన టీచర్ "ఒకే విషయం మీద కాకుండా పలు విషయాల మీద మాట్లాడుకుందాం" అన్నాడు
'సరే' అని తలలాడించారు అందరు
"అయితే ఒక్కొక్కరు మీ మీఊళ్లల్లో జరిగిన,జరుగుతున్న వింతలు చెప్పండి " అందరి కంటె ముందు మూర్తి మొదలుపెట్టాడు " సార్ మా ఊళ్లో రెండు గుట్టలున్నాయి గుట్టల మధ్య ఓ పశువులకాసే పిల్లవాడు తనచేతికర్రతో ఓ చిన్న గుంట తవ్వాడు, ఆ గుంటలో కొంచం తెల్లని పాలవలె నీళ్లు ఊరినయి సార్ అదే విషయం ఊళ్లో చెప్పాడు ఊరివాళ్లు వెళ్లి ఆ గుంటను ఓ చెలమలాగ తవ్వారు అవే నీళ్లు కొంచెం రంగుమారి కొబ్బెరి నీళ్లలాగ ఊరినయి సార్ వాటి రుచి కూడ కొబ్బెరినీళ్లలాగె వుండి వాటిని తాగితే రోగాలు నొప్పులు పోతువున్నాయి అన్నారు యిక అక్కడికి జనం రాకపోకలు పెరిగాయి సార్"
"అక్కడికి ఓ పూజారి చేరి అందులోని నీళ్లు చెంచాలతోటి జనం నాలికలమీద పోస్తూ వున్నాడా?"
"చెంచాడుకాదు సార్ ప్రతిమనిషికి ఓ చెంబెడు ముంచియిచ్చినా ఆ చెలిమలోని నీళ్లు అంతెవుంటున్నాయి సార్"
" ఇక అక్కడ తిరునాలు జరుగుతున్నాయా"
"ఎక్కడిమంది సార్, బండ్లల్ల, కార్లల్ల కాలినడకన ఎక్కడెక్కడినుండో

"ఇప్పటికి అలాగె వస్తువున్నారా?"

"ఇప్పుడు అక్కడ నీళ్లు ఊరటంలేదు సార్

" ఎందువల్లా'

" ఎవరో పాపాత్ముడు స్వయంగా తానె చెంబు ముంచుకుండట అప్పటినుండి అది యింకి పోయింది సార్"

టీచర్ నవ్వుతూ " అదంతెమూర్తి, ఎండిపోయివుంటుంది గుట్టలు యింకించుకున్న వర్షపు నీరు కిందకు జారి అడుగుబాగాన జాలు వారేది మనకు తెలుసు"

" అదివానకాలంలోనే కదా ఎండకాలంలో కూడ నీళ్లు ఊరినయి సార్"

" ఊరుతాయి తేమవున్నంతవరకు వస్తాయి ఆ తరువాత ఎండిపోతుంది అప్పటివరకు వొచ్చిన నీటిని మీ ఊరి వాళ్లను పవిత్ర జలమని నమ్మించి సొమ్ముచేసుకున్నారు అది మామూలుగ ఎండిపోగానె ఎవరో పాపాత్ముడు తానె చెంబును ముంచాడు అన్నారు అందరిలో పెంచిన నమ్మకాన్ని ఒట్టిగ వదిలితె జనం తిరగబడతారుగ, అందుకని మరో మాయ మాటను చెప్పి నమ్మించారు ఈ రెండు చోట్ల నమ్మకమే పనిచేసింది

మరో విద్యార్థి రెడ్డి, టీచర్ వైపు చూస్తు -

" సార్ మావూర్లల్లో ఆరుకాళ్ల ఆవుదూడ పుట్టింది సారు అది భగవంతుని అవతారమని జనం తండోపతండలు వచ్చి పూజలు చేశారు"

" ఆ తరువాత"

" దానిని ఓ సాధువుకు యిచ్చేశారు సారు"

" అతను దానికింత పసుపు - కుంకుమ పూసి ఊరూర తిప్పి పొట్ట పోసుకుంటుందొచ్చు అసలు మనదేశంలో ఆవు అంటేనే భక్తి భావంకదా?"

"ఎందువల్లా కావొచ్చు సార్" రహీం ప్రశ్న
" అది మనకు పాలుయిస్తుంది, దూడలను యిస్తుంది, కోడెలను యిస్తుంది, అవి అరక దున్నుతాయి బరువులను లాగుతాయి" అంటు చిరునవ్వుతో ముగించాడు
" మరి గేదే పాలిస్తుంది, దూడలనిస్తుంది, దున్నలనిస్తుంది, అరక దున్నుతుంది బరువులాగుతుంది కదసార్, మరి గేదేను పూజించరుకదా సార్"మళ్ళీ రహీం ప్రశ్న
" రహీం మంచి ప్రశ్నే వేశాడు కాని దానికి జవాబు ఎవరు చెపుతారు '
"' మీరేమంటారు సార్?"
" మీ సందేహం కరక్టే అంటాను అవు యిచ్చేపాలను కూడ మనం ఆహారంగా స్వీకరించ వల్సింది పోయి, వాటిని యజ్ఞయాగాల పూజలకు వాడుతు గోవు పవిత్రమైందని ప్రకటించి ఆ నమ్మకాలనే పెంచిపోషిస్తు, వచ్చారు కాని మనకు రెండు సమానమే"
శర్మ కాస్త కదిలి కూర్చుంటు --
"మాకు ఊరి ప్రక్కన చెరువువుంది దాని కట్ట కొమ్ముగ ఓ పుట్టవుంది ఆ పుట్టలో ఓ నాగుపాము వుందట ఎవరింట్లో శుభకార్యం జరిగినా ఆ పుట్టకు పూజచేస్తారు పాలు పోస్తువుంటారు నాగులచవితినాడు ఊరంతా వెళ్లి చెంబులకొద్దిపాలు పోస్తారు అందులోని నాగుపాము ఈ పాలను తాగుతదా సారు"
" ఈ ప్రశ్న పోసేవాళ్లనే అడగాలి, అది పెంపుడు ప్రాణికాదు ఇక పాలు పోస్తున్నరంటే మనదేశంలో వున్న జాడ్యమే, మనిషికి తిండిలేకున్న దేవుళ్లకు నైవేద్యాలు పెడుతారు వాస్తవానికి దేవునికి ఈ తిండి, వస్త్రాలు, ఆభరణాలు అవసరంలేదు వాటిపేరు మీద కోటానకోట్ల మానవ సంపాదన మరుగున పడిపోతుంది మనదేశంలో వున్న వనరులే తక్కువ ఆ తక్కువ ఉత్పత్తులను సద్వినియోగం

చేసుకోలేకపోతున్నాం దీనికి కారణం మనవాళ్ల నాటిన మూఢనమ్మకాలే " మీరంతా పెద్దవాళ్ళై బాగా చదువుకొని, సమాజంలో ఇప్పుడున్న మూఢనమ్మకాలను తొలగించి శాస్త్రీయ ఆలోచనలు పెంచి, మానవ వనరులను అభివృద్ధి వైపు మలుపు తిప్పాలి

" సార్, ఎదురుగ ధాభా వుంది" టి తాగుదామా అంటు డ్రైవర్ వ్యాన్ స్లో చేశాడు

" సరె" అన్నాడు టీచర్ ధాబా ముందు వ్యాన్ ఆగింది

" సత్యం ముందుగా వ్యాన్ దిగుతూ--"

" ఈ సందర్భంగా నాకో కవిత గుర్తొస్తుంది

" పాము పుట్టలో పాలు " " పాపాయి నోట్లో వేలు!"

అబ్బా ఏం చెప్పాడయ్య ఆ మహానుభావుడు" అన్నాడు విద్యార్థులు స్పందిస్తూ అవే కవితా పాదాలను పలుకుతు దిగారు

# రాజుల సొమ్మా?

రోడ్డుపక్కమ్మటేవున్న ధాభాముందు ఓ ప్రవేట్ బస్సు ఆగివుంది వాళ్లంతా టీ తాగుతు వున్నారు ఈలోపల వ్యాన్ ఆగగానె విద్యార్థులు అంతా దిగారు ఓ అరవై ఏళ్ల పెద్దమనిషి 'టీ' ముగించుకుని విధ్యార్థులకు ఎదురొస్తు చిరునవ్వు నవ్వాడు

పెద్దమనిషి సంకలో సంచి, చేతిలో ఆనాటి దినపత్రిక, లాల్చి పైజామ, ఆకు చెప్పులు కళ్లద్దాలు ధరించాడు విద్యార్థులు చేతులాడిస్తూ నవ్వుముఖాలతో కుర్చీలవైపు నడిచారు

" విహారయాత్ర, విజ్ఞానయాత్ర" అడిగాడు పెద్ద మనిషి ఎదురొస్తున్న సత్యాన్ని

" రెండూను" అన్నాడు సత్యం, మరింత దగ్గరై ఎదురెదురునిలుచోని ఒకరిచేతిలో మరొకరిచేయి వుంచుకుంటు

" నా పేరు సత్యం, వాళ్ల టీచర్ను"

"తెలుస్తూనే వుంది, నేనూ రిటైర్ టీచర్ను నాపేరు 'సాగర్'

" కవిసాగర్ గారైతెకాదు గదా!" అంటు మరో చేతిని నెత్తికి ఆనించుకున్నాడు ఎదోగుర్తుకు తెచ్చుకుంటు అవును అన్నట్టు నవ్వుతు చేయిని ఆప్యాయతగ నొక్కాడు

" మిమ్ముల‌ను కలుసుకోవడం చాల సంతోషంసార్" సత్యం ఆనందంగా అన్నాడు

"బస్సుకదులుతూవుంది వస్త" ఒకరున్న స్థలంలోకి యింకొకరు మారుతు అన్నాడు

" బస్సును పోనీయండి, మీరు హైద్రాబాదేగ వెళ్లేది ఏదేని బ్యాగ్‌వుంటె తీసుకొండి వ్యాన్‌లో మాట్లాడుకుంటు వెళ్లి, హైద్రాబాదులో మిమ్ములను దిగబెట్టి మేం నల్లగొండ వెడతాం ' అంటూ బస్సు వైపు నడిచి బ్యాగ్‌ను అందుకుని వ్యాన్‌లో పెటాడు

సాగర్ బస్సువాళ్లకు విషయం చెప్పివొచ్చాడు
టీలు తాగడం ముగిసిన తరువాత సత్యం, "వీరు సాగర్ గారు ప్రముఖకవి వీరి గూర్చి మీరు పత్రికల్లో చూసివుంటారు రేడియోలో విని వుంటారు వీరి రచనలకు ఎన్నో ఆవార్డ్స్ వచ్చాయి అంతేకాదు మీరు ఎనిమిదవ తరగతి తెలుగు వాచకంలో వున్న వీరి కవితను చదవచ్చు"
సాగర్‌గారిని విద్యార్థులకు పరిచయం చేశాడు అందరు నమస్కారాలతో స్వాగతం చెప్పి వ్యానువైపు నడిచి, అందుకూర్చున్నారు వ్యాను కదిలింది విద్యార్థులు తాము చదివిన పాఠాన్ని గుర్తుకు తెచ్చుకుంటున్నారు
"మీకు పాఠాన్ని రాసిన కవిగారు మీముందున్నారు మాట్లాడండి" అన్నాడు సత్యం
"కవిత మీకు సులభంగా అర్థం అయ్యిందా" అని అడిగాడు కవి
అయ్యింది అన్నట్టు తలలాడించారు
" పరీక్షలో ఓ ప్రశ్నకూడ వచ్చింది సార్, జవాబు కూడ బాగానేరాసాను' శర్మ అన్నాడు
" పాఠం అర్థమైతె ప్రశ్నకు జవాబు రాయడం కష్టమేమికాదు" సత్యం చెప్పాడు "చెప్పేటీచర్ ను బట్టి గూడ వుంటుంది లెండి" కవి అన్నాడు
" చెప్పండి సార్, ఏ ఏ ప్రదేశాలు తిరిగివస్తున్నారు" అడిగాడు సత్యం
పిల్లలు కవిగారి వైపే చూస్తువున్నారు
" ఆగ్రా, ఢిల్లీ, రాజస్థాన్, జోద్‌పూర్, ఉదయపూర్ ఇంకా మార్గమధ్యన చిన్నచిన్న పట్టణాలు, పల్లెలు" భుజానికున్న సంచిని పక్కన పెడుతు అన్నాడు సాగర్
"కేంద్ర సాహిత్య అకాడమి గ్రాంటు మంజూరిచేసి, ఆయా ప్రాంతాలు తిరిగి, అక్కడి ప్రజల జీవన విధానాలను వేష భాషలను, కట్టు - బొట్టును, సాహిత్య సంస్కృతిని పరిశీలించి రావాల్సిందిగా కోరింది అందుకని ఈ ప్రయాణం"
" యింకా మీ యాత్ర విశేషాలు ?" అన్నాడు [illegible]

" ఫతేపూర్ సిక్రి, ఆగ్రా అంత కోటలు గోరీలు వాటిని చూస్తుంటే మన పెద్దలు అనె మాట ఓటి గుర్తొచ్చింది " అని ఆగాడు

ఏం మాట అన్నట్టు చూశారు అందరు

" రాజుల సొమ్ము - రాళ్ల పాలు అని" అన్నాడు విదార్థులు ఆసక్తిగ వింటున్నారు

"ఇకపోతె ఆగ్రా సంగతి మీకు తెలుసుకదా?"

" ఏదో కొంచం చదివినం కాని చూడలేదు కదా సార్" అన్నాడు రహీం

"రారాజు ప్రణయ చిహ్నం పాలరాతి కట్టడం పాలకుని భ్రమకు ప్రజల శ్రమ అర్పితం" కవిగారు కవిత చెప్పినట్టు, చెప్పాడు

" ఆ తరువాత ఢిల్లినగరం మన రాజధాని పార్లమెంట్ ఇంకా చెప్పుకోనతగ్గ విషయం అక్కడ వందలకొలది ఎకరాల భూమి స్మశానాలకే వొదిలారు" కాసేపాగి

" అందర్కి అరడుగులైతే వాళ్లకు ఎకరాలకొద్ది" అన్నాడు తానె

" జాతీయ నాయకులు కదా అన్నాడు " సత్యం

" బిర్లామందిర్, తీన్‌మూర్తి భవన్‌లు చాలవా?"

" ఏదో అభిమానంతో"

" దేనికైనా హద్దులుండాలి దురాభిమానం కూడదు వాళ్లు యిట్లా తమ సమాధులను తీర్చిదిద్దమని చెప్పారా?" అంటూ అందరివైపు చూశాడు ఓ సారి

" ఇక రాజస్తాన్ అంతటా ఎక్కువగా కోటలు దేవాలయాలె! ఆ ప్రదేశాలను వెనకట రాజులు పాలించారు కనుక పెద్ద పెద్ద రాజమందిరాలు కట్టారు అసలె మొదటి నుండి పేదదేశం, దానికి తోడు భక్తి, భయం భయం పోవడానికి భక్తి, భక్తిని కొలవడానికి ఆలయాలు" అంటూ పిల్లలవైపు చూశాడు వాళ్లు శ్రద్ధగా వింటున్నారు అవి ఒకటి రెండు కాదు, శిల్పకళలతో నింపేశారు ఎంతమంది శ్రామికులో ఎన్నేండ్లు పనిచేశారో!

" పూజా స్థలాలు సాదాసీదాగా వుంటె చాలదా? చిత్రాలు, శిల్పాలు, అర్చ్‌లు, అలంకారాలు యివన్నీ అవసరం లేదు

[illegible] సరిపోగా?' అనాడు సత్యం

" అసలు అలయకుడ్యాలకుండె బూతు బొమ్మలను చూస్తే ఆ ప్రాంగణంలో జరిపే పూజల్లో మనస్సుఎట్లా లగ్నమైతుందో అర్థంకాదు " అన్నాడు కవి

"అవసరం లేని ఆర్భాటాలు అవన్నీ" సత్యం అన్నాడు

" గతంలో ఈ రాజులందరు తాము గడించిన సొమ్మునంతా యిట్లా అవసరానికి మించిన కట్టడాలకంటె, చెరువులు, కుంటలు తవ్వించి నీటి వనరుల పెంచితె యిప్పటిదాక వెన్నంటి వొస్తున్న కరువు వుండక పోయేదేమో" అన్నాడు కవి

మళ్లీతానె " అదే సంస్కృతి మరోరూపంలో కొనసాగుతూనేవుంది ఇప్పటి పాలకులు కూడా లక్షలు వెచ్చించి పార్టీలవారిగ, ప్రాంతాల వారిగ తమతమ నాయకుల నిలువెత్తు విగ్రహాలను ప్రతిష్టిస్తునే వున్నారు " అన్నాడు

అందరు ఆలోచనల్లోకి వెళ్లారు

# నవ్వుతూ బతకాలి

మరో గంటకు వ్యాన్ హైద్రాబాదు చేరుకొనున్నది
"ఇంకా చెప్పండి సార్,కవి పండితులతో మాట్లాడడమె ఓఎడ్యుకేషన్" అన్నాడు సత్యం
" నేను మాట్లాడితెనేను నాయిష్టమొచ్చింది మాట్లాడుతాను మీరే ప్రశ్నలు అడగండి తొచిన జవాబు చెపుతాను " అన్నాడు కవి
" అడగండి పిల్లలు, మీరు ప్రశ్నలు అడగండి" అన్నాడు సత్యం
విద్యార్థులు ఒకరి ముఖాలు వొకరు చూసుకుంటూ తమకు తెలియంది అడిగి తెలుసుకోవాలని సిద్ధమౌతు ఏదో భయం ఆవరించగ వెనక ముందు ఆలోచిస్తువున్నారు అది చూసిన కవి --
" అడగండి భయపడతారెందుకు" నవ్వుముఖంతో అడిగాడు కవి
" ఏదో తట్టినట్టు కదులుతు మూర్తి మనిషికి భయం ఎందువల్ల అవుతుంది సార్" అడిగాడు
" తప్పుచేయడం వల్లా, తప్పుడు ఆలోచనలు చేయడంవల్లా"
" ఏది తప్పో, ఏదిఒప్పో ముందె ఎట్లా తెలుస్తుంది సార్" శర్మ
" తెలుపు నలుపు ఎట్లా గుర్తిస్తాము '
" చూసి"
" గుడి గంటో, బడిగంటో ఎట్లా తెలుసుకుంటాము"?
" శబ్దంద్వార '
" నిప్పు-నీరు వేరు వేరుగున్నట్టు, మంచి - చెడులు వేరువేరుగ వుంటాయి వాని వునికితో కొంతగాకున్న కొంతైన ముందె మనకు ఓ మాదిరి స్పృహ వుంటుంది అది మనలో ప్రకృతి పరిసరాలు పెంచే ప్రాధమిక జ్ఞానం, దాని ద్వార తప్పొప్పును గుర్తించవచ్చు
" భయం తొలగాలంటే సార్" మరో విద్యార్థి
' అనవసరపు అనుమానాలను, దురాలోచనలను దరిచేరనీయొద్దు మన బుద్ధిని పెంచుకుంటె చాలు అది మన దగ్గర్కి రాదు' అన్నాడు కవి

" మంచి పనులు చేస్తె తృప్తి, చెడుపనులు చేస్తె భయం వెంటాడుతువుంటుంది' అన్నాడు సత్యం

" ఈ జరిగే చెడులన్ని ఎందుకు జరుగుతున్నట్టు సారు" రెడ్డి అడిగాడు

" అత్యాశవల్లా, ధనం మీద,పదవి మీద భూమిమీద, యింకాయింకా తనదికాని దానికోసంచేసే ప్రయత్నాలె సకలఅనర్థాలకు దారిలీస్తాయి "

" అత్యాశ కొంపకు చేటు సామెతే వుందికదండి" అన్నాడు సత్యం

అవును అన్నట్టు నవ్వాడు కవి

" భయం వల్లనే మనిషి రాళ్లకు రప్పలకు మొక్కి దాన్ని అదుపులో పెట్టుకుంటాడు" అన్నాడు సత్యం

" అంతవరకు పర్వాలేదు మధ్యన ఈ బాబాలు, స్వాములు, మాయగాల్లు మోసం చేస్తువున్నారు అమాయకుల కష్టార్జితాన్ని వొలుచుకుని, బూడిదతో నామాలు పెడుతున్నారు వాళ్లు విసిరె వలలో పడకుండ చూసుకోవాలి' అన్నాడు కవి

"అదె మనం గట్టు జాతర ఆగినపుడు చెప్పాను చూడు సైంటిఫిక్ తాట్ అంటే శాస్త్రీయమైన ఆలోచన పెంచుకోవాలి అని

ఇక్కడగూడ అదేకావాలి అదే బుద్దిని పెంచుకోవాలి బుద్ధిపెరగాలి అంటె చదవాలి" అన్నాడు సత్యం

" అంటె ప్రతివాడు సైంటిస్ట్, ప్రతివాడు పండితుడు కానక్కరలేదు నిత్యజీవితంలో తాను కష్టాలకు గురికాకుండ ఉండె తెలివితేటలుంటె చాలు పక్కవాడు చేసేమోసాన్ని పసికట్టగలిగితేచాలు అంతెకాదు తెలుగులో మహారచయిత రావిశాస్త్రి గారన్నట్టు మంచికోసం నిలవకపోయినా చెడుకు ఆసరాగా వుండొద్దు" అన్నాడు కవి

" సాహిత్యం చాటేది ఒకటి, నిజజీవితంలో జరిగేది మరోకటి! మనిషిలో సంస్కారం పెరగక ఎంత సాంకేతిక అభివృద్ధిని సాధించినా, అది వినాశనానికే గాని ప్రగతికోసం పనిచేయడం లేదండీ, రోజు రోజుకు విచ్చలవిడితనం విధ్వంసం పెరిగిపోయి సాధారణ జన జీవితాన్ని అస్తవ్యస్తం చేస్తూ వుంది' అన్నాడు సత్యం ఎంతో విసుకు చెందినట్టు

" సమాజంలో అమానవీయత పెరిగి మనిషికి మనిషికి మధ్యన పరాయితనం పెరుగుతువుంది అందువల్లా మనుషుల్లో మానవత్వాన్ని పెంచే శ్రద్ధను మేధావి వర్గమైన కవులు, రచయితలు, కళాకారులు శాస్త్రజ్ఞులు చేయవల్సివుంది దానికి ప్రతి సామాన్యుడు కూడ దోహదం చేయాలి వీళ్ల - ఈ విద్యార్థులు మనకంటె మంచి జీవితాన్ని పొందే అవకాశం మనం కల్పించవల్సి వుంది" అన్నాడు కవి

" మంచి కోసం ఆశించడం తప్పేమికాదుకదా లెటజ్‌హోప్ కాని ఎవరిని చూసిన ఏదో అసంతృప్తి, ఏదో టెన్షన్, రోగాలు - నొప్పులు అకాలమరణాలు ఒకవైపు, దొంగతనాలు - దోపిడీలు, హత్యలు, టెర్రరిజం, విచ్చలవిడి విధ్వంస చర్యలు మరొకవైపు అంతెందుకుసార్, పార్లమెంట్‌లో మనప్రతినిధుల ప్రవర్తన అసెంబ్లీలో మన శాసన సభ్యులు కొట్లాట - ఏమోసార్ ఒక్కొక్కసారి ఎటుతోయని పరిస్థితి " అంటూ తలను వంచుకుని కుడి చేతిని గాలిలో వూపాడు సత్యం

విద్యార్థులు ఎంతో ఆసక్తిగ వింటువున్నారు గొర్రెలమంద అడ్డంరాగ వ్యానునుకాస్త స్లో చేసి వాటిని తప్పకొని మళ్లి స్పీడ్ పెంచాడు డ్రైవర్, క్లీనర్ తనకు ఎడమవైపు వున్న గుట్టలశ్రేణి గమనిస్తువున్నాడు

" మీ పేరేమన్నారు? సత్యం కదా?"

అవును అన్నట్టు తల ఊపాడు

"చూడండి,సత్యం,ఒక్కమాటలో చెప్పాలంటే మనిషి నవ్వలేకపోతున్నాడు మనిషి మనసారా నవ్విన్నాడు, ఈ చెడ్డ తలంపులు ఈ టెన్షన్లు, అకాలమరణాలు వుండవు అందువల్ల నవ్వుతూ బ్రతికేటట్టు మనం జనాన్ని ఎడ్యుకేట్ చెయ్యాలి విద్యార్థి దశలో సంస్కరణ సంయమనపు విత్తనాలు నాటితే ఆ తరువాత మనిషితో పాటే అవి పెరిగి ఓ మంచి ఆరోగ్యకరమైన వాతావరణం సమాజంలో చోటు చేసుకుంటుంది

# ఇట్లా వుంటే

వ్యాన్ నయాపూల్ దగ్గర్కి రాగానే, ట్రాఫిక్ పోలీసు విజిల్ ఊది ఆపి చాదర్‌గాట్ వైపు వెళ్లమని చేయివూపుతు సైగచేశాడు
' ఉదయం పత్రికలో వచ్చిందికదా పాత బస్తిలో కర్ఫ్యూ అని, అందుకే అటు పోనీయ్యటం లేదు" టీచర్
" అంటె చార్‌మినార్ చూడడం కుదురదన్నమాట" అన్నాడు డ్రైవర్
' అంతెకదా, కర్ఫ్యూవుంటె ఎట్లావెళ్లేది" టీచర్
విద్యార్థులు నిరాశగ చూస్తు వుండిపోయారు
వ్యాన్ సాలార్‌జంగ్ మ్యూజియం ముందుకొచ్చి ఆగింది అందరు దిగి చింతచెట్టుకింద కొంత సేపు నిలుచున్నారు ఈలోపు జామకాయల తోపుడు బండివాడొచ్చాడు అందరు జామకాయలు కొనుకుని కొంతసేపు తింటునిలుచున్నారు ఆ తరువాత సాలర్‌జంగ్ మ్యూజియం మూసివున్నది చూసి ' ఇక వెడదాం" అంటు వ్యాన్‌లో కూర్చున్నారు
" సార్, హైద్రాబాదు పాతబస్తిలో ఎప్పుడు గొడవలు, కర్ఫ్యూలు" అన్నాడు శర్మ
" జనంలో రోజురోజుకు తోటి వారిని ప్రేమించే గుణం కొంత తగ్గిపోతుంది దానిని ఆసరాగా తీసుకుని దేశద్రోహులు కొంత అలజడిని సృష్టిస్తున్నారు మొత్తంమీద అమాయికులు బలైపోతున్నారు "

వ్యాన్ చాదర్‌గాట్ పక్కమ్మటి మలకపేట వైపు వెడుతువుంది ఎదురుగ రోడ్డు పక్కన ఓ భవన నిర్మాణం జరుగుతువుంది అందుకోసం తెచ్చి, కుప్పలుగా పోసిన యిసుక కంకర రోడ్డుమీద ఎక్కువ బాగాన్ని పరుచుకుని వుండి రాకపోకలకు ఆటంకంగావుంది వ్యానును దాటేసి, పోయిన ఓ స్కూటర్ ఇసుకరాసిలో కూరుకపోయి స్కూటరిస్ట్ పడిపోయాడు ఈలోపు వ్యాన్ కంకరకుప్ప మీద కదలక ఆగిపోయింది అక్కడ ఎవరిపని వారు చేసుకుంటు పోతున్నారె తప్ప పడుతున్న వారిని

"ఇదర్ర మన వాళ్ల సివిక్ సెన్స్ తన పనిచూసుకుంటారెతప్ప, వాళ్ళవల్ల ఇతరులకు జరిగే ఇబ్బందిని పట్టించుకోరు" అన్నాడు టీచర్

" ఎట్లనో అట్ల కంకరను దాటొచ్చుగాని, అఇసుక కుప్పలను దాటలేము సార్,టైర్లు దిగబడతయి' అన్నాడు డ్రైవర్ అది విని క్లీనర్ కిందికి దిగి -

" అవునండి, వెనక్కు మలుపుకోవాలి లేదా ఈ కుప్పలను పక్కకు గుంజాలి" అన్నాడు

అది విన్న విద్యార్థులు కిందికి దిగారు

"ఇట్ల రోడ్డు మధ్యన పోస్తె, వచ్చి పోయెవాళ్లకు ఇబ్బంది అనె విషయం ఈ యింటాయనకు తెలియదా" అన్నాడు క్లీనర్‌తో మూర్తి

" ఈయన ఒక్కడేకాదు ఇట్లాంటోళ్లు చాలమందున్నరు, గల్లికొకడు ఎల్తడు వాళ్లు తమ పనెల్లిందే చూస్తరు కాని యితరులకు ఇబ్బంది గురించి ఆలోచించరు" అన్నాడు క్లీనర్

" అందుకొండి అక్కడున్న తటల్బు పారలు తలోటి అందుకోండి, పక్కకు గుంజండి"అన్నాడు ముందుక్లినర్, ఆ తరువాత విద్యార్థులు తట్టలు పారలందుకుని, ఇసుక - కంకరను కడుతువున్న ఇంటివైపు లాగి రోడ్డు క్లియర్ చేశారు

అప్పటికె వాకిట్లోకొచ్చి నిలుచున్న ఇంటి ఓనర్‌తో -

" మొత్తం రోడ్డుమీదె పోశారు, వాహనాల రాకపోకలకు ఇబ్బంది కదా," అన్నాడు టీచర్

" అంటె ఇల్లు కట్టుకోవద్దంటర" అంటు పళ్లలో పుల్లను గుచ్చుతు అన్నాడు అప్పుడే భోజనం చేసినట్టుంది

" కట్టుకోవద్దని ఎవరంటున్నారు"

" మరికట్టుకుంటున్నపుడు మరి యిగ యాడపోసుకోవాలె"

" నేను పక్కకే పోయమన్న అలారోడ్డుమీద గట్ల పోసిండు అన్ని అడుగు' ' అన్నాడు మళ్ళి తానే

"మీరు దగ్గరుండి పక్కకు పోయించవల్సింది ఇప్పుడు మాముందటె ఓ స్కూటరిస్ట్ పడిపోయాడు మా వ్యాన్ వెళ్లనట్టుంది'

' మరినేనేమి చేయ్యు మీరెగట్ల నుట్టు తిరిగి ఎనకనుండి పోంత్రి"
"అయిన సాప్ జేసింత్రుగద ఇగ పోంత్రీ జగడమెందుకు"
" జగడం ఏం చెయ్యం పోతం కాని, యిట్లా మరొకసారి పాయ్యొద్దని మీకు గుర్తు ఉండడానికి చెపుతున్నాం'
" గుర్తుంటదిగాని పోంత్రి, నాకు గుర్తుంటె ఏంలాభం నడిరోడ్డున పోసేటోల్లకు గుర్తుండాలే" అంటు లోపలికి నడిచాడు
తట్టలు పారలు ఎక్కడివి అక్కడపెట్టి అందరు వ్యాన్ ఎక్కి కూర్చున్నారు
వ్యాన్ కదిలింది
" మనం ఏంచెప్పిన చెమిటోని ముందు శంకువూదినట్టె" అన్నాడు డ్రైవర్
" అవును ఆయన అన్నట్టు పోసేటోనికి కూడ బుద్ధుండాలి మరి నడిరోడ్డులో కాకుండా కాస్త పక్కకు పోస్తె, సరిపోయ్యేది" అన్నాడు టీచర్
" వొచ్చెరాకడే వున్నదివున్నట్టుగ గుమ్మరించే దానికన్న కాస్త లారీని రివర్స్ తీసుకుని, మళ్లి ముందుకొచ్చెటప్పుడు పక్కకు తీసుకుని, గుంజితె పక్కకు పడేదే" అన్నాడు క్లీనర్
"ఆ లారీమీద క్లీనర్ వున్నాడో లేడో" అంటు నవ్వాడు డ్రైవర్
" వున్నాలేకున్న అట్లాంటి విషయాలు పట్టించుకోరులే తనపని గడిస్తేచాలు ఆ తరువాత ఏమన్న కాని ఏటన్న పోని" టీచర్
" అవును చాలచోట్ల యిట్లాగే ఎవ్వరికి ఆ తరువాత జరిగెదాని గురించి ఆలోచించరు"
" ప్రతి మనిషి తన పనిని తాను చేసుకుంటు ఇతరుల పనులకు అడ్డుకోని విదంగ నడుచుకుంటే సమస్యలే వుండవుకదా" అన్నాడు టీచర్
అవును అన్నట్టు చూశారు విద్యార్థులు
" అలానడుచుకోవడానికి ఒకింత ఆలోచన, మరికొంత ఆచరణ, పట్టి - విడుపుల మనస్తత్వం వుంటె చాలు ఏగొడవలు వుండవు" అన్నాడు టీచర్
అవును సార్ అన్నట్టు చూశారు విద్యార్థులు
ఈలోపు వ్యాన్ చాదర్‌ఘట్ చౌరస్త దాటి మలక్‌పేట వైపు పరుగెడుతువుంది

***

# చదువు

వ్యాన్ హైద్రాబాదు నగరంలో వెలుతువుంది

ఓచోట బి వి పట్టాభిరామ్,

డైరెక్టర్, ప్రశాంతి హిప్నోథెరపి మరియు సైకోథేరఫీ క్లీనిక్

హైద్రాబాదు, అనివుంది

" డ్రైవర్ వ్యాను పక్కకు ఆపండి "అన్నాడు టీచర్ వ్యాన్ పక్కకు ఆగింది

" స్టూడెంట్స్ పక్క బి వి పట్టాభిరామ్‌గార్కి క్లినిక్ వుంది వెళ్ళి ఆయన్ను కలుసుకుందాం పదండి " అని దిగి క్లినిక్ లోకి ప్రవేశించి హాల్లో కూర్చోని, లోపల వున్న పట్టాభిగార్కి పలాన జిల్లా స్కూల్ విద్యార్థులొచ్చారు అని చెప్పి పంపారు కొద్ది క్షణాల తర్వాత నవ్వు ముఖంతో పట్టాభిరామ్ గారు హాల్లోకొచ్చారు పరిచయాలయ్యాయి

" సార్ మా విద్యార్థులు ఇంటర్ మీడియట్‌కు వెళ్లనున్నారు జ్ఞాపక శక్తి పెరగడానికి ఏమైన చిట్కాలతో కూడిన సందేశమివ్వండి' ' అన్నాడు టీచర్ పట్టాభిరామ్ ఆలోచిస్తు నిలుచున్నాడు

''అవును సార్, ఎంత చదివినా జ్ఞాపకం వుండటంలేదు చెప్పండి' ' అన్నాడు మూర్తి

''చెప్పండి సార్'' అన్నాడు శర్మ

పట్టాభిగారు మధ్య సోఫాలో కూర్చుంటు చెప్పడం మొదలు పెట్టారు

## చదువు కూడా ఒక హాబీయే

ఈ కాలంలో చదువు అంటే అదేదో తప్పనిసరైన బాధ్యతగా భావిస్తున్నారు విద్యార్థులు వాస్తవానికి ఆటపాటలంటే ఎంత ఆసక్తిగా ఉంటుందో చదువుని కూడ ఒక హాబీగా చేసుకోవచ్చు చర్చిల్ ఒక సందర్భంలో Education is fun game అన్నాడు చదువు కూడా సరదాగా ఆడుకునే ఆటలాంటిదయినపుడు మరి ఇబ్బంది ఎక్కడొస్తుంది? దానికి కారణం ఒకటే చదువు సమయంలో ఇతర ఆలోచనలు, భయాలు, ఆందోళనలు మరికొంత సమయాన్ని వృధా చేస్తాయి అశ్రద్ధ, నిర్లక్ష్యం, సోమరితనం, ఇంకొంత సమయాన్ని తీసుకుంటే వ్యసనాలు, సినిమాలు, చెడుస్నేహాలు మిగితాసమయాన్ని మింగి వెస్తాయి ఇంక చదువు పట్ల శ్రద్ధ ఎక్కడినుంచి వస్తుంది? సత్ఫలితాలు ఎలా సాధ్యమవుతాయి?

చదువుపై శ్రద్ధ పెరగడానికి ఆసక్తి పెంపొందించుకోవడానికి లండన్ యూనివర్సిటీకి చెందిన హెచ్ డి జె వైట్ కొన్ని చక్కని చిట్కాలు తెలిపాడు ఇవి పాటించిన వారు చదువులో విజయం సాధించారు ఆయన రచించిన study well అనే పుస్తకాన్ని అమెరికా, ఆస్ట్రేలియా దేశాల్లో కూడా ఆయా ప్రభుత్వాలు, విద్యార్థినీ విద్యార్థులకు పాఠ్యాంశంగా చేర్చారు ఆయన సూచించిన చిట్కాలను గమనించండి

### సమయాన్ని కేటాయించండి

చదవటానికి ఉపక్రమించే ముందు ఎంత సమయం మీరు కేటాయించగలరో నిర్ణయించుకోండి ఏదో హడావిడిగా కూర్చుని చదివితే ఏదీ రాదు అంతకన్నా మానేయటమే మంచిది ఎందుకంటే చదివినా బుర్రకెక్కలేదనే అభిప్రాయం మనసు మీద పడితే ప్రమాదం చదవదల్చుకున్నప్పుడు కనీసం ఒక గంట కూర్చోగలిగితే శ్రేయస్కరం అప్పుడే చదువు మొదలెట్టండి

## రోజుకో సబ్జెక్టు

ఒకరోజు ఒకే సబ్జెక్టు తీసుకోండి మిగతా సబ్జెక్టు పుస్తకాలను దూరంగా ఉంచండి ఆ రోజు ఆ సబ్జెక్టు మాత్రమే చదవాలని నిర్ణయించుకోండి మనస్సులో ఆ సంకల్పం బలంగా ఉంటే ఆటోమేటిక్‌గా ఆ సబ్జెక్టుపై ఆసక్తి పెరిగి తీరుతుంది

## మూడుసార్లు చదవాలి

మీ మాతృభాష ఇంగ్లీషు కాదు అందుచేత పాఠాన్ని మొదటిసారి చదివినప్పుడు అర్థం కాని పదాలకు డిక్షనరీ చూసి అర్థాలు పక్కనే పెన్సిల్‌తో రాసుకోవడం మంచిది తరువాత రెండవసారి చదవండి దీనివల్ల పాఠంలోని విషయం బాగా అర్థమవుతుంది మూడవ సారి చదవడంవల్ల ఆ పాఠం అంతా క్షుణ్ణంగా మనస్సులోకి ఎక్కుతుంది దీనినే simple reading and re-reading habit అంటారు ఇలా రోజుకొక పాఠం చదివితే చాలు సంవత్సరంలో మీకు 365 రోజులుంటాయి మీకున్న అన్ని సబ్జెక్టులలో పాఠాలన్నీ కలిపి 200 కూడ ఉండవు

## ముఖ్యాంశాలు

పాఠం మూడు సార్లు చదివిన తరువాత పాఠంలోని ముఖ్యమైన పాయింట్లను పెన్సిల్‌తో అండర్‌లైన్ చేయండి తరువాత చదివినపుడు మొత్తం పాఠం చదవనవసరం లేదు అండర్‌లైన్ చేసిన వాక్యాలు చదివితే పాఠంలోని ముఖ్యాంశాలు, మొత్తం ఇదివరకు చదివిన పాఠాన్ని గురు చేస్తాయి దీనినే study retrieval అంటారు

## సినాప్సిస్ అవసరం

ఇపుడు చదివిన దానిని ఒక పుస్తకంలో నోట్సు రాసుకోవాలి

అవసరమైతే మొత్తం పాఠాన్ని మళ్ళీ చదవండి మీకు అర్థమయ్యే భాషలో పదాలతో పాఠం సారాంశాన్ని తయారు చేసుకోవాలి అంటె ఇది ఒక విధంగా అది సినాప్సిస్ లాంటిది ఇలా చేసిన సినాప్సిస్‌ని నెలకోసారి చదవండి ఇక పరీక్షలో ఎలా వ్రాస్తారో చూసుకోండి ఇకవిజయం మీదే

పైవిధంగా చదివితే ప్రైవేటు స్టూడెంట్ కూడా పరీక్షల్లో విజయం సాధించగలడు అటువంటప్పుడు రోజూ కాలేజికి వెళ్ళే విద్యార్థి అపూర్వ విజయం స్వంతం చేసుకోవచ్చు కాలేజీ లెక్చరర్లు చెప్పేవి వింటూ ప్రాక్టికల్స్ చేస్తూ ఒకింత శ్రద్ధ చూపగలిగితే మీరు చదివే చదువు మీకు ఆనందాన్నిచ్చే ఆటగా చేసుకోవచ్చు

ఇక మీరు చదువుతూ పోండి మీకే అనుభవంలోకి వస్తుంది

"తాంక్యుసర్, మా విద్యార్థులు మీ సూచనలను తప్పక పాటిస్తారు " అన్నాడు టీచర్

'కృతజ్ఞతతో చప్పట్లు కొట్టండి" అన్నాడు టీచర్

విద్యార్థులందరు చప్పట్లు కొట్టారు

'ఓకె, శ్రమ, శ్రద్ధ వహిస్తే తప్పక మీ పరీక్షలలోనే కాదు జీవితంలో ప్రతిదాంట్లో విజయాన్ని సాధిస్తారు కాని క్రమ శిక్షణ మరువద్దు నేను ఓ ప్రశ్న పత్రాన్ని యిస్తాను దానిని చూసి మీరేమిటో మీరే తెలుసుకోవచ్చు'అంటూ లోపలికి వెళ్లి ఓ పేజి నిడివిగల ప్రశ్న పత్రాలను తెచ్చి విద్యార్థులకు పంచుతాడు విద్యార్థులు తలా ఓటి అందుకుని అక్కడినుండి కదిలి, మరోసారి కృతజ్ఞతలు చెప్పి బయటికి నడిచి హ్యానులో కూర్చుంటారు

మీరు క్రమశిక్షణ గల స్టూడెంటో కాదో తెలుసుకోవడానికి ఈ ప్రశ్నాపత్రంపై పెన్సిల్‌తో టిక్కుపెట్టండి ప్రశ్న ఒకేసారి చదవాలి సమాధానం వెంటనే టిక్కుపెట్టాలి

1 ప్రతిరోజూ ఒక గంటైనా ఇంట్లో చదువుతారా? -అవును/కాదు

2 చదవాటానికి ఏదైనా టైంటేబుల్ చేసుకుంటారా? - అవును/కాదు

3 మీరు చదివే గ్రూపు మీకు ఇష్టమేనా? - అవును/కాదు

4 కాలేజీకి ప్రతిరోజు తప్పక వెళ్తున్నారా? -అవును/కాదు

5 క్లాసులో కూర్చుంటున్నారా? -అవును/కాదు

6 క్లాసులో చెప్పినది నోట్‌బుక్స్‌లో వ్రాస్తున్నారా? -అవును/కాదు

7 మీ నోట్సులు ప్రాక్టికల్ పుస్తకాలు మీరే వ్రాసుకుంటారా? -అవును/కాదు

8 పరీక్షలంటే టెన్షన్ లేకుండా ఉండగలుగుతున్నారా? -అవును/కాదు

9 ప్రతి రాత్రి ప్రశాంతంగా నిద్రపోగలుగుతున్నారా? -అవును/కాదు

10 క్లాసురూంలో ముందు వరసల్లో కూర్చుంటారా? -అవును/కాదు

11 చదువుతోపాటు మీ ఇతర హాబీలేమైనా ఉన్నాయా? -అవును/కాదు

12 క్లాసుటీచరు మిమ్మల్ని ఏదైనా ప్రశ్న అడగాలనుకుంటారా? -అవును/కాదు

13 క్లాసు పూర్తయ్యాక డౌట్స్ ఉంటే టీచర్ని అడుగుతారా? -అవును/కాదు

14 మీకన్నా ఇతరులు బాగాచదువుతున్నారనే టెన్షన్ ఉందా? -అవును/కాదు

15 చదువు లేకపోతే ప్రమాదంలో పడతాననే భయం ఉందా? -అవును/కాదు

పై ప్రశ్నల్లో పదికన్నా ఎక్కువ 'కాదు లు టిక్కుపెడితే మీరు చదువుపై శ్రద్ధ పెంచుకోవాల్సిన అవసరముందన్నమాట

- బి వి పట్టాభిరామ్,

ఎవరికి వారె ప్రశ్నలను చదివి, టిక్కులు పెట్టుకుంటువుంటారు వ్యాన్ కదిలింది

వృత్తి విద్యను నేర్చుకోండి
బతుకు బాటలు వేసుకోండి

పి లక్ష్మినర్సయ్య

జవహర్‌లాల్ నెహ్రూ, ఐ టి ఐ చౌటుప్పల్



## రచనలు

1 కష్ట సుఖాలు నాటిక

2 నడుస్తున్న చరిత్ర - వెలుతురు, పావురాలు - కవితా సంకలనాలు 3

3 లోకం ఎచ్చరిక దున్న రంగులు చీమలు తెలంగాణ వెతలు కథా సంకలనాలు 6

4 జాతర - నవల

5 డా॥ బి ఆర్ అంబేద్కర్ బాబు జగజ్జీవన్ రామ్ జీవితచరిత్రలు 2 (విద్యార్థులు కోసం)

## పాఠ్యాంశాలుగా ఎన్నికైన పుస్తకాలు

1 జాతర నవలను బి ఎ బి ఇడి కి టెక్స్టుబుక్‌గా మైసూర్ విశ్వవిద్యాలయం ఎన్నిక చేసింది

2 గొరైలు కథలను ఎం ఏ తెలుగుకు పాఠ్యగ్రంథంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎన్నిక చేసింది

3 దున్న కథలను కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఎం ఏ తెలుగుకు పాఠ్యాంశంగా నిర్ణయించింది

4 డా॥ అంబేద్కర్ కవితను VIII తెలుగువాచకంలో పాఠ్యాంశంగా ఎన్నిక

## అందుకున్న అవార్డ్స్

1 ఎచ్చరిక కథలకు శ్రీశ్రీ స్మారక బంగారు పతకం 1984

2 జాతర నవలకు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ నవల అవార్డు - 1989

3 డా॥ బి ఆర్ అంబేద్కర్ జీవిత చరిత్రకు కేంద్ర దళిత సాహిత్య అకాడమి, న్యూఢిల్లీ వారి ఫెలోషిప్ 1994

4 వెలుతురు కవితలకు రాష్ట్ర ప్రభుత్వం నగదుతో సన్మానం

## పాల్గొన్న విశిష్ట సమావేశాలు - సభలు

1 రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేషియా 1981

2 బెంగుళూర్ తెలుగు మహాసభలు - 1990

3 కథా సదస్సు - మద్రాసు - 1991